# శృంగార తిలకం

## కాళిదాస కృతి



### పద్యానువాదం

### భావముఖ వ్యాఖ్య


**డా॥ మేళ్లచెర్వు భానుప్రసాదరావు**

రీడరు, తెలుగు విభాగం

యస్.యస్. & యన్. కళాశాల, నరసరావుపేట.

ఈ గ్రంథం
తెలుగు విశ్వ విద్యాలయం వారి
ఆర్థిక సహాయంతో ముద్రించబడింది.



ప్రథమ ముద్రణ
విక్రమ, దీపావళి
అక్టోబర్, 2000
ప్రతులు 1000



ముద్రణ
శాయి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
అరండల్‌పేట
నరసరావుపేట - 522 601.

వెల రు.25/-

ప్రతులకు
మేళ్ళచెర్వు భానుప్రసాదరావు
భరద్వాజ, 4-2-6, బండలబజారు
మునిసిపల్ హైస్కూల్ వెనుక
నరసరావుపేట - 522 601
ఫోన్ : 08647 - 24802



# తిలక ముకురం

మహాకవి కాళిదాసు రచించిన లఘుకావ్య పరంపరలో తిలక ప్రాయమైన రచన శృంగార తిలకం. ఇది ముప్పై యొక్క శ్లోక రత్నాలతో శోభిల్లే సువర్ణ ఫలకం. ప్రతి శ్లోకం ఒక గాథ. ఈ గాథలు వైవిధ్య భరితాలు. కాళిదాస శృంగార రస పోషణ ప్రతిభా విశ్వరూపాలు.

ప్రతి శ్లోకానికి వెనుక మనోజ్ఞ సన్నివేశం అగాథగాథ. అడుగడుగునా నాయికా నాయకుల బాహ్య సౌందర్య చిత్రణం అంతః కరణ విశ్లేషణం. ఇంతటి మహోదాత్త కృతిని ఆంధ్రపాఠక సోదరులకు భావముఖ వ్యాఖ్యతో అందిస్తే ఆదరపాత్ర మైతుందని ఈ ప్రయత్నం చేశాను. పద్యరూప ఆంధ్రీకరణం సైతం చేశాను. ఈ ఆంధ్రీకరణం పలువురు ప్రాచీనాధునికాంధ్ర మహాకవు లవలంబించిన స్వేచ్ఛామార్గంలో సాగింది.

ఈ గ్రంథం ఆంధ్ర సహృదయ లోకానికి
ఆనందం కలిగిస్తుందని ఆశిస్తున్నాను.

# కరచాలనం

డా॥ నాగభైరవ కోటేశ్వరరావు, డి.లిట్,
కేంద్ర సాహిత్య అకాడమి మాజీ సభ్యులు

కాళిదాస మహాకవీంద్రుని
గాన వాహినిలో కరంగిన
ఉజ్జయిని నేడెక్కడమ్మా
ఉంది చూపించు -

నేడు ఉజ్జయిని లేకపోవచ్చుగాని, ఉజ్జీలేని ఉపమలతో కవిత్వాన్ని కలకండగా అచ్చుపోసిన కాళిదాసు ఉన్నాడు. మన సంస్కృతిలో, మన సాహిత్యంలో, మనరక్తంలో,

ఉపమా కాళిదాసస్య - అనుకున్నాం - అన్నాం. కవికుల గురువుగా వారిని ఎన్నుకున్నాం.

ఆ కాళిదాసు సాహిత్యాన్ని పాలగ్లాసుగా ఎంచి తరతరాల నుంచి తాగుతూనే ఉన్నాం.

కాళిదాసు తరానికొక్కడుపుట్టడు. దేశానికొక్కడు పుట్టడు. లోకానికే ఒకడు పుడతాడు. ఒక్కడు కాళిదాసు అనిపించుకుంటాడు. అతడు కాలంలో కలిసిపోడు ఇంద్రజాలం కవి కళిదాసు. ఇంద్ర ధనుస్సు కవి కాళిదాసు.

అతడు శృంగార రసానికి మానాగా శృంగార తిలకం కావ్యం రాశాడంటారు. రాసేవుంటాడు. వివాదాలు అనుమానాలు మనకు వద్దు. అవన్నీ కోతిపుండును బ్రహ్మాణ్రవణంగా చూసే చేసే పండిత ప్రకాండులకు వదిలేద్దాం.

కాళిదాసు వ్రాసిన శృంగార తిలకాన్ని రంగవల్లిక లల్లినంత అందంగా డా॥ భానుప్రసాద్ అనువదించాడు.

డా॥ భాను ప్రసాద్ బహుముఖ ప్రజ్ఞావంతుడు. మొన్న పోతన భాగవతం – శృంగారం అన్న అంశం మీద సిద్ధాంత వ్యాసం వ్రాసి ప్రామాణిక మనిపించుకొని డాక్టరేట్ పట్టా పుచ్చుకున్నాడు. నిన్న కాళిదాస కృతమైన దేవీ అశ్వధాటికి వ్యాఖ్యానం చెప్పి పండితుల చేతనే కాకుండా పామరులచేత కూడ భళీ అనిపించుకున్నాడు.

ఇవాళ – శృంగార తిలకంకు బంగారంలాంటి పద్యానువాదం చేసి, వ్యాఖ్యను గూడా అనుసంధానం చేసి మనముందు తన ప్రతిభను కుప్పవోశాడు.

అనువాదం గూర్చి ఒక చమత్కారం లోకంలో ఉంది. "Translation is a bride; If she is beautiful, she may not be truthful; If she is truthful, she may not be beautiful" కాని డా॥ భానుప్రసాద్ అందమూ, ఆత్మాచెడకుండా (Both beautiful and truthful) అనువదించి తన ప్రజ్ఞానిధిత్వాన్ని నిలువెత్తుగా నిటారుగా నిలుపుకున్నాడు.

అన్నం ఎలాగూ ఆస్వాదించబోతున్నారు కదా ! ఇక్కడ ఒక్క మెతుకును పట్టి చూద్దామనే చపలత్వం నాది.

కాళిదాసు అంటాడు మాలినీ వృత్తంలో :

అవిదిత సుఖదుఃఖం నిర్గుణం వస్తు కించి
జ్జడమతి రిహ కశ్చిన్మోక్ష ఇత్యాచ చక్షే
మమ తు మత మనంగ స్మేర తారుణ్య ఘూర్ణ
న్మద కల మదిరాక్షీ నీవి మోక్షో హి మోక్షః

డా॥ భాను ప్రవహిస్తాడు తేటగీతిలో :

అవిదిత సుఖదుఃఖమె మోక్షమని, యగోచ
రమని, గుణరహితమని యరసికు లంద్రు
మదనుని చిరునవ్వులు గల మత్తు కనుల
మగువ నీవి మోక్షమె మోక్ష మందు నేను.

శృంగార తిలకంలోని కొన్ని పద్యాలను తిరుపతి వేంకట కవులు ఆంధ్రీకరించారు. ఇదే శ్లోకాన్ని వారెలా అనువదించారో చూడండి చంపకమాల గట్టి :

మమత సుఖంబు దుఃఖ మను మాట లెరుంగనియట్టి శుద్ధ శూ
న్యమగు పదంబు మోక్షమని యందురు గొందరు మూర్ఖు, లస్మదీ
య మతము నందు మోక్షమనగా మధుపాన విమోహిత స్వశీ
ల మహిత మానినీ మణి చలత్కరవారిత నీవి మోక్షమే !

ఒకరిది చలన రహిత నిర్మల జల సమూహంలో సుఖంగా పడవ ప్రయాణం లాంటి అనువాదమైతే, మరొకటి చలదుత్తుంగ తరంగ సాగరంలో ఓడ ప్రయాణం. రెండిటి గమ్యమూ ఒకటే. ఒక్కటే !

ఇక్కడ నాకింకొక సంతోషం. ఈ గ్రంధాన్ని డా॥ భానుప్రసాదరావు తన ఆబాల్యస్నేహితుడు, సతీర్థుడు, సత్కవి, ఇవాళ ఆంధ్ర దేశపు పద్యకవుల్లో పరిమళ భరితుడూ డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డికి అంకిత మిస్తున్నాడు. ఇది రెండు మనసులు కట్టుకొన్న మరుమల్లెల వంతెన. ఇద్దరూ నాకు ఆత్మీయులే. ఇద్దరూ కవులే. ఇద్దరూ పరిశోధకులే. వ్యాఖ్యాతలే. విఖ్యాతులే. ఇది సమ్మోద సందర్భం.

పరిశోధకుడుగా ప్రపంచానికి పరిచయమై వ్యాఖ్యాతగా వన్నెకెక్కి, అనువాద కవిగా అగ్రస్థానాన్ని అందుకోబోతున్న చిరంజీవి డా॥ భాను ప్రసాదరావును అభినందిస్తున్నాను. సంతోషం అంచున నిలబడి కరచాలనం చేస్తున్నాను.

నిజానికి ఇలా అభినందించాల్సిన పని యూనివెర్సిటీలదీ, సాహిత్య అకాడమీలదీ కదా !

N. K. Prabhairav

(నాగభైరవ కోటేశ్వరరావు)

లాయరుపేట, ఒంగోలు,
విక్రమ మహార్ణవమి



6-10-2000

# అభినందన

ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య
హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం.

డా॥ మేళ్ళచెర్వు భానుప్రసాదరావు గారు శృంగార తిలకానికి చేసిన తెలుగు అనువాదమూ, వ్యాఖ్యా ఈ గ్రంథంగా తెలుగు రసికుల చేతుల్లోకి ఇప్పుడు వస్తున్నది. అభిజ్ఞాన శాకుంతల మాది ప్రఖ్యాత కృతులేకాక కాళిదాస మహాకవి ఈ శృంగార తిలకం పుష్పబాణ విలాసం రాక్షస కావ్యం అన్న మూడు లఘు కావ్యాలను కూడ రచించాడు. ఈ మూడు కావ్యాల కర్తృత్వ విషయికంగా భిన్నాభిప్రాయా లున్నాయి. ప్రస్తుత కావ్యం 31 శ్లోకాలది కాగా తక్కిన రెండూ 26, 20, శ్లోకాల కావ్యాలు ! ఈ కావ్యాలను ఎవ్వరు రాసినా వీటి లోకం వేరు.

ఈ శృంగార తిలకంలోని శ్లోకాలు కొన్ని వివిధ అలంకార గ్రంథాలలో లక్ష్యాలుగా ఉండటం ఈ గ్రంథ ఔన్నత్యాన్ని చాటుతున్నాయి.

శృంగార తిలకంలో ధర్మా ధర్మ శృంగారాలు రెండూ ఉన్నాయి. ఒక శృంగార భావాన్ని ఎంత ఘనంగా కవిత్వీకరించడానికి అవకాశం ఉన్నదో అంతగా కవిత్వీకరించాడీ కావ్యకర్త. ఇప్పుడీ తెలుగు వ్యాఖ్యాసహితమైన తెలుగు అనువాదమే లేకపోయి ఉంటే ఆలోటు అట్లాగే కొనసాగుతూ ఉండేది. ఏవో నాలుగు పద్యాలు అసమర్థంగా రాయడం కాక భాను ప్రసాదరావుగారు అనువాద పద్యాలన్నింటినీ ఎంతో రమణీయంగా రాశారు. రసికానందం కావ్యంలో తిరుపతి వెంకట కవులు కొన్ని శ్లోకాలను అనువదించినా ఎవరి మార్గం వారిది.

అనువాదంలోని గుణాత్మక వృద్ధికి మూల శ్లోకాలను అనువాద పద్యాలనూ ఇచ్చి చూపవచ్చును. మొదటి శ్లోకాన్నే భాను ప్రసాదరావు గారు తెలుగులోకి ఇట్లా అనువదించారు.

కరములు తమ్మితూడులు ముఖంబరవిందము, సారు నీరముల్
పిరుదులు తీర్థ ఘట్టములు వేణియె నాచు, కనుల్ ఝషంబులున్

తరుణి యురోజ యుగ్మము రథాంగ యుగంబయి, పూరుషాళికిన్
స్మరశర తాపమార్ప విధిచక్కగ జేసె సతీ తటాకమున్

చివరి పాద విషయికంగా వీరు చేసిన చిన్నమార్పు ఎంతో హృద్యంగా ఉన్నది.

మూలం :

కన్దర్ప బాణానలై / ర్దగ్ధానామ వగాహనాయ విధినా రమ్యం సరోనిర్మితమ్

సంస్కృతంలో ఇది కేవల సరస్సు. తెలుగులో నిది సతీతటాకం. ఇది వ్యాఖ్యాపూర్వకమైన అనువాదమని చెప్పనక్కరలేదు. భాను ప్రసాదరావుగారు చాలా పద్యాలలో తమ ప్రతిభను ఇట్లా చూపారు.

ఇక వ్యాఖ్యానానికి వస్తే ప్రతి శ్లోక వ్యాఖ్యానంలోనూ వీరు మూడు విభాగాలు చేసికొన్నారు. మొదటి పరిచ్ఛేదంలో ఆ శ్లోక భావానికి పూర్వ రంగాన్ని భావించి, దాన్ని మన ముందుంచారు. రెండవ పరిచ్ఛేదంలో శోక తాత్పర్యాన్ని ముక్కస్యముక్క పద్ధతిలో కాక భావుకుడుగా ఇచ్చారు. మూడవ పరిచ్ఛేదంలో శోకార్థం పూర్ణంగా అవగాహన కావటానికి సరిపడే వివరణల నిచ్చారు. పై శ్లోక పద్యాలకు వారి మూడవ పరిచ్ఛేదంలో ఇచ్చిన వివరణలో కొంత చూడండి.

సంయోగ శృంగార సాధన సంపదలైన వారి అవయవాల నన్నింటినీ తటాకంలోని వస్తు విశేషాలుగా కవి భావించాడు. ఇట కాంతను కామోత్సవ కాసారంగా మన్మథమహాతీర్థంగా దర్శించాడు.

అపఖ్యాతిపాలైన శృంగార విషయాన్ని మన్మథ మహాతీర్థంగా భాను ప్రసాదరావు గారు రూపిస్తూ దానికి పవిత్రతను సాధించిపెట్టే ప్రయత్నం చేశారు.

నిజానికి ఈ లఘుకావ్యంలో కొన్నిచోట్ల అధర్మ శృంగారమూ ఉన్నది. వాటిని వ్యాఖ్యానిస్తూ వ్యాఖ్యాత తన ధర్మ బుద్ధిని సంకోచ పరచుకోలేదు. 14వ శ్లోక పద్య వ్యాఖ్యానంలో వ్యాఖ్యాత యొక్క ఈ ధర్మ బుద్ధి తెలుస్తుంది. ధ్వని గర్భితమైన అనేక శ్లోక పద్యాలకు వ్యాఖ్యాత చేసిన వ్యాఖ్యానం వారి వైదుష్యాన్నే కాక భావుకతనూ తెల్పుతున్నది. అట్లాంటి చోట్ల వీరు స్పష్టంగా ఇది వ్యంగ్యార్థం అని కూడా తేటతెల్లంచేశారు. 17వ శ్లోక వ్యాఖ్యానం ఇట్లాంటిది.

ఘటంతో పోల్చిన 10వ పద్యం చాలా చాలా బాగుంది. 13వ పద్యంలో మదన కుతూహలరాగం మీద వీరి కల్పనలు గుండెలోకి దూరి నిలుస్తాయి. రసరమ్యలోకానికి చేరుస్తాయి. శృంగార తిలకంలోని పద్యాలు శృంగార భూయిష్ఠాలుగా కాక మరొక రకంగా ఎట్లా ఉంటాయి. మూలకర్త కొన్నిచోట్ల ధర్మాధర్మాలను చూడలేదు. వ్యాఖ్యాతకేమీ ? ధర్మబుద్ధి ఉన్నది. అంతేకాదు అధర్మ శృంగారం రసాభాస అనగల్గిన వైదుష్యమూ ఉన్నది. 21వ పద్యంలో

చూడన్ వేశ్యలు పంచబాణ సుఖముల్ జోడైన ధన్యుండగున్

అని మూలానుసారంగా రాసినప్పటికీ ఈ వ్యాఖ్యాత తమ వ్యాఖ్యానంలో వివరిస్తూ ఇక సామాజికంగా చూస్తే వేశ్యా గమనం నీతి బాహ్యం, వారు ప్రదర్శించే ప్రేమ విటులు సమర్పించుకొనే ధన కనక వస్తు వాహనాల మీదే, అంతానటనే. వారితోడి సరసం శృంగార రసాభాసమే నంటారు మరికొందరు అని అంటారు. పిచ్చి పిచ్చి శృంగారాన్ని వ్యాఖ్యానంలోనైనా సరిదిద్ద గల్గినందుకు డా॥ భానుప్రసాదరావు గారు అభినందనీయులు. ధర్మ బుద్ధి కల్గిన వృద్ధులకు ఈ కావ్యంలోని కొన్ని శ్లోకాలు విద్యు దాఘాతాన్నిస్తాయి. అలాంటి చోట్ల వ్యాఖ్యాత వ్యాఖ్యాన వివరణలు సద్యః చికిత్స చేస్తుండడం హర్షణీయం !

ఏలా మోమున మోము నుంచి గదియన్ ? ఏమైన సిగ్గున్నదా? వంటి గుణరీత్యాధిక్యం ఉన్న పద్యాలను రాయగలిగిన ప్రతిభ సామాన్యమైంది కాదు. మంచి భావుకుడైన వ్యాఖ్యాత వీరన్నది ప్రత్యక్షరమూ నిరూపిస్తున్నది. అందువల్ల నేటి కాలపు పాఠకునికి ఈ కావ్య వ్యాఖ్యాపఠనం లాభాన్నే తప్ప నష్టాన్ని కల్గించదు. ఒకటి రెండు మూలగతమైన పుడకలను పక్కకు పెడ్తే, శృంగార తిలక మూలాన్ని, తెలుగులో చక్కని వ్యాఖ్యతో చదువుకునే అవకాశం కల్గిస్తున్న భావుక విద్వాంసుడూ కవీ అయిన మిత్రులు డా॥ మేళ్లచెర్వు భానుప్రసాదరావు గారిని మనసారా అభినందిస్తున్నాను. వారు ఒక మంచి కావ్యం రాయకూడదా అనిపిస్తుంది. వారి భావుకత నన్నీమాట అనిపిస్తున్నది. మళ్లీ ఒకసారి మనసారా అభినందిస్తున్నా . .



సరూర్‌నగర్, హైదరాబాద్
విక్రమ. విజయ దశమి

(ముదిగొండ వీరభద్రయ్య)
7.10.2000

# ఇదీ సంగతి!

నేను పి.హెచ్.డి. పట్టంకోసం పోతన భాగవతం - శృంగారం అనే అంశంపై పరిశోధన చేస్తున్న రోజులు. చౌఖాంబా వారి నుంచి శృంగార్ రస్‌కా సర్వస్వ తెప్పించాను. దానితోపాటు నాకు ఉపయో గిస్తుందేమోనని కాబోలు శృంగార తిలకాన్ని కూడా పంపించారు. ఉచితంగా, డా॥ కపిలదేవ గిరి గారి హిందీ వ్యాఖ్యా సమేతం.

ఒక రోజు మా పెద్ద మేనమామ దోనెపూడి లక్ష్మీనారాయణ గారి కుమారుడు చి॥ శ్రీరామమూర్తి మా ఇంటికి వచ్చాడు హర్యానాలోని పాబ్రా నుండి. అతడు ఆ పుస్తకాన్ని చూచి బావా ! ఈ శృంగార తిలకానికి నీవు తెలుగు వ్యాఖ్య వ్రాస్తే పోలే ! అత్యద్భుతంగా ఉంటుంది. ఎటూ శృంగారివి కదా ! చేయరాదు ! అని చమత్కరించాడు. అదే అంతర్గతంగా నిలిచిన ప్రేరణ.

అప్పుడప్పుడూ వ్యాఖ్య కొంత కొంతగా రాస్తూ వచ్చాను. ఈ సందర్భంలో హిందీ వ్యాఖ్యతో పాటు వివిధాలంకార శాస్త్రాలు, వాత్స్యాయన కామ సూత్రాలు గీతగోవింద కావ్యం ఎంతో ఉపకరించాయి. ఆ తరువాత ఇక దాన్ని పట్టించుకుంటే ఒట్టు.

ఉన్నట్టుండి మొన్న వేసవిలో మళ్లీ పురుగు తొలిచింది. ఒక్కొక్క శ్లోకానికి ఒక్కొక్క పద్యం చొప్పున ఆంధ్రీకరిస్తే బాగుంటుందనిపించింది. నిదానంగా పూర్తి చేశాను. ఒక రోజు రాత్రి విద్వత్కవి చింతలపాటి నరసింహ దీక్షిత శర్మ గారు మా అతిథిగా ఉండి గ్రంథమంతా విన్నారు. ప్రోత్సహించారు. నాకూ హుషారొచ్చింది.

తర్వాత తెలుగు విశ్వవిద్యాలయం వారి ప్రకటన చూచి ప్రచురణకు ఆర్థిక సహాయం కోసం పంపాను. ఫలించింది.

మొన్న జూలైలో హైదరాబాదు విశ్వవిద్యాలయానికి పునశ్చరణ తరగతుల నిమిత్తం వెళ్లినప్పుడు ఆచార్య ముదిగొండవారితో ఈ విషయాన్ని ప్రస్తావించి అలంకార శాస్త్రాల్లో మీరు విశేష కృషి చేసిన వారు కాబట్టి అభిప్రాయం వ్రాయాలి అనికోరాను. వారు అంగీకరించి అభిప్రాయం పంపించారు.

ఆ తరువాత ఒకరోజు తిరుపతి వెంకట కవుల గీరతాన్ని చూస్తున్నప్పుడు ఒక పద్యం కన్పించింది. అందులోని భావం శృంగార తిలకంలోది. ఆ పద్యం రసికానందంలోది అని ఉంది. వెంటనే రసికానందాన్ని మా పట్టణ గ్రంథాలయాల్ని అన్వేషించి సాధించాను. తీరా చూస్తే అందులో 17 పద్యాలు శృంగార తిలక శ్లోకానువాదాలే. గుండె గుభిల్లు మంది ! జంకు మొదలైంది. ఆ మహాకవుల పద్యాలున్నట్లు మొదటే తెలిస్తే ఈ రచనకే ఉపక్రమించే సాహసం చేసేవాణ్నే కాదు. వారు మహానుభావులు మహాకవులు వారి ముందు కుప్పిగంతులా ! మిత్రులతో ఈ విషయం చెప్పాను. ఎవరి పంథావారిదంటూ ముందుకు నెట్టారు. పైగా ఇప్పటికే గ్రాంటు వచ్చిందాయె !

ఈ విషయాన్ని ముదిగొండ వారికీ నాగభైరవ వారికీ తెలియజేశాను. వారూ అలాగే అన్నారు. ముదిగొండ వారు అభినందన నాగభైరవ వారు కరచాలనం పంపారు.

ఇదీ జరిగిన సంగతి ! కానీ కరములు తమ్మితూడులు అనే తొలిపద్యం ఎత్తుగడ తిరుపతి వెంకట కవులదీ, నాదీ ఒక్కటే కావటం యాదృచ్ఛిక విశేషం. ఇలాగే ఒండు రెండు పదాలూ. దీనికి కారణం ఆ మహా కవుల అదృశ్యానుగ్ర హాశీర్వాదా లనిపిస్తున్నది. కాకపోతే మరేంటి చెప్పండి ?

ఈ కృషికి మా పెదనాన్న చెన్నకేశవులు గారు, మా మేనమామలు వజ్రనఖ దోనెపూడి వెంకయ్యగారు, రాళ్లభండి శ్రీరామమూర్తి గారు, మా మామగారు వేమూరి సీతారామయ్యగారు, ఆనందించి ఆశీర్వదించారు. మా మిత్రులు డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి, డా॥ వేదాంతం శ్రీనివాస అయ్యంగార్ అభినందించి ప్రోత్సహించారు. మా మిత్రుడు డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డి ఈ శృంగార తిలక కావ్యాన్ని మా స్నేహాంకంగా స్వీకరిస్తున్నాడు.

శాయి ఆఫ్‌సెట్ వారు ప్రత్యేక శ్రద్ధతో ఈ గ్రంథాన్ని ముచ్చటగా ముద్రించారు.

అందరికీ కృతజ్ఞతలు



ఇదీ సంగతి !

[signature]

# స్నేహాంక స్వీకృతి



మస్తాన్‌రెడ్డి　　　　　　　　భానుప్రసాద్

రసజ్ఞ కవి మిత్రుడు

**డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డి**

కం॥

ధర్మజ్ఞుని కావ్యకళా

మర్మజ్ఞుని మత్సతీర్థ్యు మాన్యుండని డా

క్టర్మస్తాన్‌రెడ్డికి నే

నర్మిలి శృంగార తిలక మంకిత మంటిన్

భాను

# అక్షర లక్షలు



ఉన్న యట్లుండి మా భాను ఒక్కనాడు
ఆంధ్ర శృంగార తిలక కావ్యంబు నీకె
అంకితమ్మనె ! కాదు కా దంటి నేను
అంత అర్హత నా కున్నదా ? యటంచు.

ఆపై నెచ్చెలి ముచ్చట
మోపై యుండుటను నాకు మొగ్గుటె మిగిలెన్
తీపై నాల్గు దశాబ్దుల
దాపై కొనసాగు స్నేహ తాత్పర్యమునన్.

డిగ్రీ నుండి పిహెచ్.డి. దాక కనుగొంటిన్ సర్వ సబ్రహ్మచా
రి గ్రామంబున సుస్థిరాంకముగ వర్ధిల్లెన్, సుహృత్త్వాభిధా
న గ్రంథంబున నూత్న పత్రముల సంధానించె, మచ్ఛ్రేయముల్
వ్యగ్రుండై జపియించె ! ఈ కృతి నిడెన్ భానుండు నవ్యప్రభన్.

కాళిదాస మే ధాగాధ ఖని జనించి
చటుల కాంతుల దశ దిశా తటుల నించి
తనరు బంగారమును పనితనము మీర
హార మొనరించి యిడె నుపహారముగను.

భానును నేను నొక్క పడవం బయనించితి మిన్ని నాళ్లు ! మా
భానున కే మొసంగగల వాడను! పద్యధనంబు నిత్తు ! వి
ద్యా నిధు లెల్ల దీని గని ఔ నని ఔదల లూపి మెత్తు ! రే
మైనను ఈ కృతీంద్రమున కక్షర లక్ష లొసంగ న్యాయమౌ !

రసరాజాంచిత ప్రౌఢకావ్య పఠన ప్రారంభ సంరంభముల్
వ్యసనంబై ప్రసరింప మాకు గలిగెన్ భావైక్య, మా సఖ్యమే
వసివాళ్వాదని మాలతీ లతికయై ప్రాకెన్, త్వ దామోద భ
వ్య సుధావృష్టిని పుష్టి నిందు బుధులారా ! భారతీ ప్రీతిగా

కృషి యన పాశుపాల్య మన నెక్కడలేని విధాన ప్రేమ ము
న్మిషితము మాకు నిద్దరకు, నిర్భర భక్తి మరంద పూర్ణ హృ
చ్చషకము లొప్పు నిర్వురకు, శాంత దినాంత సమీర చార ని
స్తుషిత శరీర భార పరితోషుల మిద్దర మో కళానిధుల్ !

శ్రీ భరద్వాజ గోత్రాభరణుండును
రమణీయ మల్ల సంగ్రామ భీము
డాంజనేయ పదాంబుజార్చన లోలుండు
సుందరకాండ యుక్ శుచిముఖుండు
భాను సత్కవి పితృపాదుండు పుణ్యుం డ
నంత లక్ష్మీ ప్రాణనాయకుండు
అస్మదీయాభ్యుదయ పరంపరాకాంక్షి
పండితుం డాచార భాస్వరుండు

సింహ సమ గమనుడు శేషాచల మనీషి
మేళ్లచెర్వు వంశ మిహిర మూర్తి
దేవగణము గూడి దివి నుండి దీవనల్
కురియు గాక ! చాల మురియు గాక !

శ్రీమంతు జేయుతను ! చేయుత నాయు రారో
గ్యామేయు ! మారుతి సమార్ద్ర మనస్కు డౌచున్
భా మండితున్ హితుని భాను ప్రసాదరావున్
శ్రీ మేళ్లచెర్వు కుల సింధు తుషార రోచిన్.

చేరెడ్డి మస్తాన్ రెడ్డి

(డా॥ చేరెడ్డి మస్తాన్ రెడ్డి)



# శృంగార తిలకం

## మూలానువాదాలు

శార్దూలం

బాహూ ద్వౌ చ మృణాళ మాస్యకమలం
లావణ్య లీలాజలం
శ్రోణీ తీర్థశిలా చ నేత్ర శఫరీ
ధమ్మిల్ల శైవాలకమ్ ।
కాంతాయాః స్తనచక్రవాక యుగలం
కందర్పబాణానలై
ర్దగ్ధానా మవగాహనాయ విధినా
రమ్యం సరోనిర్మితమ్ ॥

చం॥ కరములు తమ్మితూడులు ము
ఖం బరవిందము సౌరు నీరముల్
పిరుదులు తీర్థ హట్టములు
వేణియె నాచు కనుల్ ఝషంబులున్
తరుణి యురోజయుగ్మము ర
థాంగ యుగంబయి పూరుషాళికిన్
స్మరశర తాపమార్ప విధి
చక్కగ జేసె సతీ తటాకమున్.



# శృంగార తిలకం

## భావముఖ వ్యాఖ్య

మన్మథుడు తన పూల బాణాలతో కాముకుల్ని దహింపచేస్తుంటాడు. బ్రహ్మదేవుడు వారి దేహతాపాల్ని శాంతింప చేయటానికి, స్త్రీ అనే సౌందర్య భరితమైన సరోవరాన్ని సృష్టించాడు. ఇది ఒక రసజ్ఞ మిత్రుడి రసరమ్యభావన.

యువతుల బాహువులే తామరతూళ్ళు. లక్ష్మీ కళ వుట్టిపడే ఆమె ముఖమే కమల సంపద. ఆమె యౌవన కాంతులూ శృంగార లీలా విలాసాలే అందులోని శీతల జలాలు, అందమైన ఆమె కటి ప్రదేశమే స్నాన ఘట్టం, చంచలాలైన సోగ కన్నులే బెడిస చేపలు, ముచ్చటగొలిపే ఆమె వాలు జడ అందాల శైవాలం. వర్తులాలైన స్తనాలే ప్రేమకు ప్రతిరూపాలై విహరించే చక్రవాకాలు, మన్మథ బాణాలతో పరితపించే వ్యక్తులు సుస్నాతులై తాపం తీర్చుకోవటానికి ఇలా స్త్రీ అనే అందమైన సరస్సును బ్రహ్మ నిర్మించాడు.

మన్మథ క్రీడలకు రంగ స్థలం స్త్రీ. ఇక్కడ లావణ్య విలాసాలుగల సచేతనమైన స్త్రీమూర్తికీ అచేతనమైన సరస్సుకూ అభేదం వుంది. సరసులోదిగి జలక్రీడలాడితే దేహ తాపం తీరిపోతుంది. సరసిజాక్షితో కలసి విహరిస్తే మదన తాపం మటుమాయమైతుంది. మహానందం కలుగుతుంది. సంయోగ శృంగార సాధన సంపదలైన వారి అవయవాల నన్నింటినీ తటాకంలోని వస్తు విశేషాలుగా కవి భావించాడు. ఇట కాంతను కామోత్సవ కాసారంగా మన్మథ మహా తీర్థంగా దర్శించాడు.

శార్దూలం

ఆయాతా మధుయామినీ యది పున
ర్నాయాత ఏవ ప్రభుః
ప్రాణాయాన్తు విభావసౌ యది పున
ర్జన్మ గ్రహం ప్రార్థయే ।
వ్యాధః కోకిల బంధనే విధుపరి
ధ్వంసే చ రాహు గ్రహః
కందర్పే హరనేత్రదీధితి రయం
ప్రాణేశ్వరే మన్మథః ॥

తే॥ వచ్చె మధుమాస యామినుల్ పతియె రాడు
చచ్చి సాధింతు రాహువై చంద్రు గరతు
స్మరునిగా సఖు, హరునిగా స్మరుని, బోయ
నై పికాళి వేధింతు నన్ వేపినారు. 2

పూల ఋతువు పరిమళించే సరికి ప్రవాసంలోవున్న పతిదేవుడు వచ్చి ఒళ్లోవాలి కౌగిట్లో కరగిస్తానన్నాడు. కానీ విధి వక్రించటంతో అలా చేయలేక పోయాడు. ఆమె మదిలో కదిలే ఊహలు కరగిపోయాయి. అప్పుడు ఆ విరహ బాధను భరించలేక తనకు పునర్జన్మను ప్రసాదించమని ఆదైవాన్ని ప్రార్థిస్తున్నది ఒక విరహోత్కంఠిత.

హృదయ మధురమైన వసంత రాత్రులైతే వచ్చేశాయి. కానీ వాటితో పాటే వస్తానన్న ప్రియుడు మాత్రం రాలేదు. ఈ విరహాగ్నిలో నా ప్రాణాలు దహించుకపోతాయి. అప్పుడిక నాకు పునర్జన్మ నిమ్మని దైవాన్ని ప్రార్థిస్తాను. నాకు మానవ జన్మ కలిగితే నేను కరకుబోయనైతాను. కుహూ కుహూ నాదాలతో నన్ను విరహంలో విసిగించిన ఈ నీచ కోకిలలను బంధిస్తాను. గ్రహ జన్మలభిస్తే రాహువుగా పుడతాను. నన్ను తన శీతల కిరణాలతో వేధించిన వాడూ పాపాత్ముడూ. అయిన చంద్రుడిని పట్టి పీడిస్తాను. దైవంగా జన్మిస్తే పవిత్రమైన ముక్కంటి కంటి మంట నైతాను. దురాత్ముడైన మన్మథుడిని మాడ్చి మసి చేస్తాను. దుఃఖరహిత నైతాను. అలా కాక విధి నన్ను మన్మథుడిగా సృజిస్తే, మాట తప్పి నన్ను దుఃఖపెట్టినందుకు నా ప్రియుడికి మన్మథబాధ నధికం చేస్తాను. ఓ విధాతా! నాకు పునర్జన్మ ప్రసాదించు. నా కోరిక మన్నించు.

2

మన్మథ మహారాజుకు మంచి వసతి వసంతం. పురివిప్పిన మధుమాస చైతన్యానికి ప్రోషిత భర్తృక ప్రతిస్పందిస్తుంది. విరహోత్కంఠతో చింతాక్రాంత అవుతుంది. అప్పుడు ప్రియుడి విరహం వల్ల కలిగే బాధకన్న వసంతంలోని కామోద్దీపకాలైన కోకిలాదులు అధికమైన బాధను కలిగిస్తాయి. అందుకని ప్రకృతిని ఉపాలంభిస్తుంది. చివరకు విరక్తభావంతో మరణోద్యుక్త కూడా కావచ్చు. ఇది అంతా మధుమాస మన్మథలీల. సహజంగా ప్రతిరాత్రి వసంతరాత్రిగా పరిమళించాలని కోరుకుంటుంది ప్రతి జంట. ఆ కోరిక తీరక పోతే వారికి అంతా అంధకారమే.

వసంత తిలకం

ఇందీవరేణ నయనం ముఖమంబుజేన
కుందేన దంత మధరం నవపల్లవేన ।
అంగాని చంపకదలైః స విధాయ వేధాః
కాంతే కథం ఘటితవా నుపలేన చేతః ? ॥

చం॥ కలువలతోడ కన్నులు ము
ఖంబును తామరపూవుతోడ మ
ల్లెల రదవారమున్ పెదవి
లే జిగురాకుల చంపకంబులన్
బలు సొబగైన యంగముల
బ్రహ్మ సృజించి త్వదీయ చిత్తమున్
శిలగ సృజించెనో యతివ !
చిత్రము శైలములో యుఠోజముల్ ! 3

ప్రణయ కోపంతో ప్రియురాలు మూతిముడుచు కుంది. చందమామలాంటి తన ముఖాన్ని కందగడ్డ చేసుకుంది. దాంతో ఆమెకు ప్రీతి కలిగించటం కోసం ఆమె ప్రత్యంగ సౌందర్యాన్ని పదే పదే ప్రశంసిస్తున్నాడు ప్రియుడు. పొగడ్తలకు పరవశించని వారుండరు కదా !

ఓ కాంతా ! ఆ సృష్టికర్త అందమైన కలువలతో నీ కళ్లను కాంతిమంతంగా సృజించాడు. చల్లని పరిమళాలను వెదజల్లే పద్మాలతో నీ ముఖాన్ని మనోహరంగా మలిచాడు. తెల్లటి మల్లె మొగ్గలతోటి తీరైన నీ పలువరుసను నిర్మించాడు. సుతారమైన ఎర్రటి నవపల్లవాలతో నీ పెదవులను సుందరంగా తయారుచేశాడు. సుకుమారమైన చంపక దళాలతో నీ యితర అవయవాలను అతి లావణ్యంగా శిల్పీకరించాడు. ఇలా సుకుమార కుసుమ పేశలమైన వస్తు సంపదతో నీ దేహ నిర్మితి చేసిన ఆ విధాత, నీ చిత్తాన్ని మాత్రం కఠిన శిలతో చేశాదెందుకో ! ఆ రహస్య మేమిటో మరి !

3 ఆమె కఠిన స్తనాల ప్రభావంతో మనసు రాయిగా మారిందని భావం. ఆమె స్తనమండలానికిది ప్రశంసా మండనం. అతివలకు చిత్త సారళ్యం వక్షః కాఠిన్యం శోభావహమని భావధ్వని. ఇలా సమగ్రమైన నాయికాగుణ, సౌందర్య సంపదను ప్రస్తుతించటంవల్ల ఉత్కర్ష పెరిగి శృంగారం వృద్ధి పొందుతుంది. అది పుష్టిమంతమైతుంది.

వసంత తిలకం

ఏకో హి ఖంజనవరో నలినీదలస్థో
దృష్టః కరోతి చతురంగ బలాధిపత్యమ్ ।
కిం మే కరిష్యతి ? భవ ద్వదనార విందే
జానామి నో నయన ఖంజనయుగ్మ మేతత్ ॥

తే॥ బిసరుహము మీద కాటుకపిట్ట జూడ
కల్గు చతురంగబల మధికంబు గాను
నీ ముఖాంబుజంబున గంటి నేడు నేత్ర
ఖంజన యుగమ్ము నా భాగ్యగరిమ నెరుగ ? 4

కళ్లకు కాటుక దిద్దుకొని తళుకు బెళుకు చూపులతో తన హృదయాన్ని కలవరపెడుతున్నది ఒక మృగ నయన. ఆ చిలుకల కొలికి నేత్ర సౌందర్యాన్ని చూచి భావగర్భంగా ఒక సరసుడు అంటున్న మాటలివి.

ఓ సుందరీ ! పద్మదళాల మీద వాలిన ఒక్క కాటుక పిట్టను చూచినా చాలు అతడు భాగ్యశాలి ఔతున్నాడు. వాడు అనంతమైన చతురంగ బలాధిపత్యాన్ని పొందుతున్నాడు. ఇది నిస్సందేహం. మరి నేనిప్పుడు నీ ముఖపద్మం మీద వున్న నల్లని కన్నులనే కాటుక పిట్టల జంటను చూస్తున్నాను. దీనికి ఫలితం మరెంత గొప్పగా వుంటుందో ! ఎంత మనోహరంగా వుంటుందో! మరి నా అదృష్టం ఎలాగుందో !

కొన్ని జంతువుల మీదా, కొన్ని ప్రాంతాలలోను కొన్ని సమయాలలో వాలిన కాటుక పిట్టను చూస్తే రాజ్య పదం లభిస్తుందన్నది శకున శాస్త్ర విషయం. సంభోగం కోసం కాటుక పిట్టలు వాలిన చోట మహానిధి లభిస్తుందని ప్రతీతి. అందుకే శృంగార భావ ప్రకాశాలైన ఈ సుందర నాయికా ముఖపద్మంలోని నేత్రఖంజనాలను కనుగొంటే తనకు ఆమె హృదిలోని ప్రేమ నిధి లభిస్తుందని అతని ఆశ. రాజ్యరమకన్న రమణీమణీ ప్రేమ సామ్రాజ్యం కామకేళీ విలాసాల ఖజానా గదా ! ఎవరు ఆశపడరు? మహా మునులు మాత్రం ముక్కుమూసుకొని కూర్చున్నారా ? స్త్రీల కడగంటి చూపుల వెంటబడ కున్నారా !

శార్దూలం

యే యే ఖంజన మేకమేవ కమలే
పశ్యన్తి దైవాత్క్వచి
త్తే సర్వే కవయో భవన్తి సుతరాం
ప్రఖ్యాత పృథ్వీభుజః ।
త్వద్వక్త్రాంబుజ నేత్రఖంజన యుగం
పశ్యన్తి యే యే జనా
స్తే తే మన్మథ బాణజాల వికలా
ముగ్ధే కిమిత్యద్భుతమ్ ? ॥

చం॥ కమలము నందు నిల్చునొక
ఖంజనముం గనగా కవీశులో
విమల భువీశులో యగుట
విందుము గాని భవన్ముఖాంబుజ
స్థమునగు నేత్రఖంజనము
జంట గనుంగొనగా మనోజ బా
ణములు హృదంతరాళమును
నాశమొనర్చును చిత్రమో చెలీ !

కాటుక దిద్దిన కళ్లతో కట్టెదుట కన్పిస్తున్నది ఒక సంపంగిలాంటి సుందరాంగి. ఆమె దర్శనంతో తన మనస్సు కుదిలపడుతున్న రీతిన ఆమెకు నివేదిస్తున్నాడు ఆవేదనతో. కలవర పడుతున్న తన మనస్సును గూర్చి ఆశ్చర్యపోతున్నాడు.

ఓ ముద్దరాలా! కలువపూలమీద వాలిన ఒక్క కాటుక పిట్టనైనా సరే ! దైవవశాత్తు ఎవరైతే చూస్తారో వారంతా సరస సత్కవు లైతున్నారు. లేకపోతే సుప్రసిద్ధ రాజన్యమూర్ధన్యు లైతున్నారు. కానీ ఆ మాటలన్నీ నీపట్ల తారుమారవు తున్నాయి. నీ ముఖం మీద వాలిన నీ కన్నులనే కాటుక పిట్టల జంటను చూస్తున్న వారంతా నిస్సందేహంగా మన్మథ బాణాల బారిన బడి హృదయాలలో బాధపడుతున్నారు. వారు నీపట్ల ఆకర్షితులైతున్నారు. వికల చిత్తులైతున్నారు. ఇది ఎంత ఆశ్చర్యకరమైన విషయం ? దీని రహస్య మేమిటో చెప్పుమరి ?

కాటుక దిద్దిన కళ్లు శృంగార రస ప్రసార కేంద్రాలు. ఆ కళ్ళలో కంతుడు కాపురముంటాడు. కవ్విస్తుంటాడు. ఆ సునయనను-చూచే వారిని వలరాజు పూల బాణాలను సంధించి మధురంగా వేధిస్తాడు. సరస హృదయుడికి కవిత్వం కన్న ప్రభుత్వం కన్న సరసిజాక్షి రసరమ్య వీక్షణాలు మిన్న. అవి మధురాతి మధురాలు. తరగని శృంగార రసాభిషేకాలు. అందమైన జవరాలి కళ్లు రసహృదయుడికి గళ్లు లేని వలపుల వాకిళ్లు గదా !

మాలిని

శ్లో॥ ఝటితి ప్రవిశ గేహే మా బహిస్తిష్ఠ కాన్తే
గ్రహణ సమయవేలా వర్తతే శీతరశ్మేః ।
తవ ముఖ మకలంకం వీక్ష్య నూనం స రాహు
ర్గ్రసతి తవ ముఖేందుం పూర్ణచంద్రం విహాయ ॥

ఆ॥ గ్రహణకాల మిద్ది గృహములోనికి రమ్మ
బయల నుండ వలదు పాడు రాహు
చంద్రబింబ మనుచు చక్కని నీ మోము
నొడిచిపట్టు విధుని విడిచిపెట్టు. 6

గ్రహణ సమయంలో ఇంటి ముంగిట్లో కూర్చున్న తన నవ వధువును లోనికి రమ్మని పిలుస్తున్నాడు ప్రియుడు. వచ్చి కౌగిట్లో కరగి పొమ్మంటున్నాడు. తొందర చేస్తున్నాడు. ఇది రసధ్వనితో కూడిన నాయక విరహం.

ఓ చంద్ర ముఖీ ! అలా బయట కూర్చోకు. చటుక్కున లోనికి రా ! ప్రమాదం పొంచివుంది. ఇది గ్రహణ సమయం. దుష్టుడు రాహువు వస్తాడు. అందుచేత నీవులోనికి రా ! రాకుంటే ఆ పాడు రాహువు ఈ పున్నమి నాటి సకలంక చంద్రబింబాన్ని విడిచి పెడతాడు. మచ్చలేని అందమైన నీ ముఖ చంద్రబింబాన్ని చూచి పరవశిస్తాడు. ఒడిచి పడతాడు. జాగ్రత్త ! లోనికి రా !

భార్యా ముఖబింబం చంద్రబింబం కంటె మనోజ్ఞం. చంద్ర కిరణాలు అతడిని ఉన్నచోట ఉండనీయటం లేదు. పైగా ఆ వెన్నెల రాత్రిలో ఆ రతి రూప సుందరి కెవరైనా వలపులవల విసరుతారేమోనని భయం. భార్యా రక్షణం భర్త కర్తవ్యం కదా ! మరి అందుకే ఆమె త్వరగా లోనికి వస్తే తానే రాహువై తన బాహువులతో ఆమెలోని అణువణువునూ ఆక్రమించాలనీ మధురబాధను రగిలించాలనీ ఆత్రుత. లోనికి వేగిరంగా రాకుంటే తన దుడుకుతనం బయట పడుతుందని అతని బెంగ. ప్రియా విరహం క్షణ మొక యుగం కదా ! అయితే రాత్రి సుఖానికి సఖి అభీష్టాన్నీ దేశ కాల విశేషాల్ని గుర్తించి వర్తించటం రసజ్ఞుడి లక్షణం.

శార్దూలం

కస్తూరీ వరపత్రభంగ నికరో
మృష్టో న గండస్థలే
నో లుప్తం సఖి ! చందనం స్తనతటే
ధౌతం న నేత్రాంజనమ్ ।
రాగో న స్ఖలిత స్తవాధర పుటే
తాంబూల సంవర్ధితః
కిం రుష్టాసి గజేంద్రమత్త గమనే
కిం వా శిశు స్తే పతిః ॥

తే॥ చెంపల మకరికల శోభ చెదర లేదు
సడలనే లేదు వక్షోజ చందనంబు
కనుల కాటుక కెమ్మోవి కాంతులంతె
అలిగితివా ? భర్త పసివాడా ? అతివ చెపుమ ? 7

తొలి రేయంతా ముద్దు ముచ్చట్లతోటే ముగిసింది ఒక క్రొత్త జంటకు. ఆ సంగతి తెల్లవారుతూనే స్ఖు లందరికీ తెలిసిపోయింది. వసివాడని ఆ అందాల చంపక మాలను చూచి వరుడి రసికతను శంకించారు ఆమె సఖులు. దానితో ఆమెను సంశయాల వెల్లువలో ముంచెత్తారు.

ఓ గజరాజ గమనా ! ఓ సఖీ ! నీ చెక్కిళ్ల మీది మకరికా పత్రాలు మాసిపోలేదే ? వక్షోజాల మీది చందన లేపనం చెదరిపోలేదే ? కళ్లకు దిద్దిన కాటుక కాస్తయినా కరిగి పోలేదే ? పెదవుల మీది తాంబూలరాగం రంగు తగ్గలేదే ? ఏమిటీ రహస్యం. ఎందుకీ గోప్యం. రాత్రంతా ప్రణయ కోపంతో ముగిసిందా ? అతడేమైనా వెర్రి బాగులవాడా ? రసికత నెరుగని పసివాడా ?

పతి అమాయకుడూ అసమర్థుడూ అయితే ఆమె ఆనందంగా ఎలా వుంటుంది. సంభోగ మొక్కటే అనురాగానికి సంకేతం కాదు గదా ! తమ తమ హృదయాలను విప్పిన సరస సంభాషణం, చివరకు చిరునగవు కూడ అనురాగ చిహ్నమే. హృదయానందాన్ని కల్గిస్తుంది. నవవరుడు తొలిరేయి మంచి మాటలతో చిరునవ్వులతో చిలిపి చేతలతో నవ వధువుకు నమ్మకాన్ని కల్గించాలి. సిగ్గును భయ సంశయాలను పోగొట్టాలి. తన కనుకూలంగా మలచుకోవాలి. అంతే – అంతమటుకే.

కామశాస్త్రానికి అరవై నాలుగు కళలూ అంగవిద్యలే. అందులో తాంబూల సేవనం ఒకటి. అలాగే స్త్రీలు కస్తూరితో మకరికా పత్రాలను ముఖం మీద స్తనాల మీద చిత్రించుకోవటాన్ని విశేషక ఛేద్యం అంటారు. శిరోజాలను శరీరంలోని ఇతర అవయవాలను అందంగా సవదరించుకోవటం కూడ అంగ విద్యలే. విశేష శృంగార సుఖాన్ని పొందాలంటే కామ సూత్రాలతో పాటు ఈ అంగ విద్యలను కూడ అశివలు తప్పని సరిగా నేర్చుకోవాలంటాడు వాత్స్యాయనుడు.

శార్దూలం

నాహం నో మమ వల్లభశ్చ కుపితః
సుప్తో న వా సుందరో
వృద్ధో నో న చ బాలకః కృశతను
ర్న వ్యాధితో నో శఠః ।
మాం దృష్ట్వా నవయౌవనాం శశిముఖీం
కందర్ప బాణాహతో
ముక్తో దైత్యగురుః ప్రియేణ పురతః
పశ్చాద్గతో విహ్వలః ॥

ఉ॥ బాలను కోప మే నెరుగ
వల్లభుడున్ పసివాడు గాదులే !
చాలని వాడు వృద్ధుడును
షండుడుగాడు శఠుండు గాడు ని
ద్రాళుడు గాడు చంద్రముఖి
తన్విని నన్గని తాళలేని వా
డై లలి ముక్త దైత్యగురు
డై చనె ముందుగ విహ్వలుండునై. 8

రాత్రి గడచినా సంభోగ చిహ్నాలు కన్పించని నూతన వధువును చూచి చెలికత్తెలు చుట్టు ముట్టారు. ప్రియుడు పసివాడా ఏమిటని వ్యంగ్యోక్తులు సంధించారు. అందుకు ఆమె చెప్పిన సమయోచిత సమాధాన మిది.

ఓ చెలులారా! మీరనుకున్నట్లు నా ప్రియుడి మీద నా కెటువంటి కోపమూ లేదు. సరస సంభాషణలతోటే రాత్రి గడచి పోయింది. అంతే కాని అతడు వృద్ధుడూ కాదు, పసలేని వాడూ కాదు. పసివాడూ కాదు. బలహీనుడూ కాదు. వ్యాధి పీడితుడూ కాదు. కోపదారి మోసకారి కానేకాదు. సోమరిపోతు అంతకంటె కాదు. శఠనాయకు డసలే కాదు. అయితే! నవయౌవనవతిని చంద్రముఖిని అయిన నన్ను చూస్తూనే పంచబాణుడి బారిన పడి భావోద్రేకంతో పరవశించి పోయాడు. ఆగలేక పోయాడు. అంతే ! అంతా ముందే ముగిసింది. ఆ తర్వాత పాపం ! సిగ్గుతో వ్యధతో ముందుగానే వెళ్లిపోయాడు - ఇదీ సంగతి.

తొలిరేయి ప్రియభాషణలతో సుకుమారంగా నిగ్రహంగా వ్యవహరించాలి. నమ్మకాన్నీ ప్రేమనూ పెంచుకోవాలి, పంచుకోవాలి. అంతే కాని మొరటు వ్యవహారం పనికిరాదు. ఇక స్త్రీ అనురక్త అయిన తరువాతనే పురుషుడు అనురక్తుడు కావాలి. అప్పుడే ఉత్తమ ఫలితం. అదే ఉత్తమ రతి. లేక పోతే మందవేగుడైన ఈ కథా నాయకుడిగతే ఎవరికైనా. ఇక పైన చెప్పిన లక్షణాలున్న భర్తల వల్ల స్త్రీలకు సుఖ ముండదని, అందువలన వారు రతిపతులైన పరపతులకు వరసతు లయ్యే అవకాశముందని వాత్స్యాయ నోక్తి.

శిఖరిణి

సమాయాతే కాన్తే కథ మపి చ కాలేన బహునా
కథాభిర్దేశానాం సఖి ! రజని రర్థం గతవతీ ।
తతో యావల్లీలా కలహ కుపితాస్మి ప్రియతమే
సపత్నీవ ప్రాచీ దిగియ మభవత్తావ దరుణా ॥

మ॥ పలుదేశమ్ములు తిర్గివచ్చి పతి భా
వావేశుడై చెప్పు నూ
సు లనేకంబుల నర్ధరాత్రమరిగెన్
చోద్యంబుగా, భర్తతో
పొలయల్కల్ చెలరేగ రాత్రిసనె, సం
భోగేచ్ఛతో నాథుపై
వలపుల్ జిమ్మెడు నంతలో సవతియై
ప్రాగ్దిక్కు రాగిల్లెబో ! 9

ప్రవాసం నుండి వచ్చిన భర్తతో రాత్రంతా గడిచినా ఆ రమణీమణిలో రవ్వంతైనా రంగు తగ్గలేదు. అది గమనించిన చెలులు వేసిన ప్రశ్నలకు నాయిక చెప్పిన రసరమ్యమైన ప్రత్యుత్తర మిది.

ఓ సఖీ ! నా గురించి మీరనుకునే ఊహ లేవీ నిజం కావు. నా ప్రియుడు ప్రవాసంలో వుండి చాలకాలం తర్వాత వచ్చాడు. ఆయన తిరిగిన పలు దేశాలలోని వింతలను విశేషాలను ఎంతో ఆసక్తికరంగా చెప్పాడు. నా కోసం ప్రేమతో తెచ్చిన వస్తువులను గురించి కమ్మని కథలు కథలుగా వివరించాడు. మైమరిపించే ఆ మాటల తోటే మాకు సరిపోయింది. తీరా చూస్తే అర్ధరాత్రి దాటిపోయింది. తరువాత నాకు మాయదారి ప్రణయ కోపం ముంచుకొచ్చింది. అలకతీరి మల్లెతీవలా అల్లుకుపోదా మనుకునే సరికి తూర్పు దిక్కాంత ఎర్రబారింది. అది నా మీద కోపించిన సపత్నిలా తోచింది. ఇంతలో భళ్లున తెల్లవారింది. ఇదీ సంగతి.

ఇది ప్రవాసానంతర శృంగార చిత్రణం. ఈ ప్రణయ మూర్తుల ముచ్చట్లు ప్రణయపద మంత్రాలే. అవి పరస్పరం సమ్ముగ్ధుల్ని చేస్తాయి. హృదయాలకు హత్తు కుంటాయి. ఈ శృంగారోక్తులే వాచిక శృంగారం. అవి నిత్య స్మరణీయాలైతాయి. వాటితో వారికి యుగాలు క్షణాలుగా దొర్లుతాయి. అయితే తెల్లవారితే వారి మనసులు మృదుమధురంగా మూలుగుతాయి. ఇక సపత్నీభావాన్ని తూర్పు దిక్కుకు ఆపాదించటం అతి సుందరమైన ప్రకృతి మానవీకరణం. ఇలా ప్రకృతిలో ప్రణయ కాంతను దర్శించటం మహాకవి కాళిదాసుకే చెల్లింది.

శార్దూలం

శ్లాఘ్యం నీరసకాష్ఠ తాడన శతం
శ్లాఘ్యః ప్రచండాతపః
క్లేశః శ్లాఘ్యతరః సుపంక నిచయైః
శ్లాఘ్యోఽతి దాహోఽనలైః ।
యత్కాంతా కుచపార్శ్వ బాహులతికా
హిందోల లీలా సుఖం
లబ్ధం కుంభవర! త్వయా న హి సుఖం
దుఃఖైర్వినా లభ్యతే ॥

మ॥ ఘటమా! వందల కఱ్ఱదెబ్బలును నీ
కాయెండలన్ మాడుటల్
పటువౌ పంకము ద్రొక్కిడిన్ నలుగుటల్
బల్ మంటలన్ గ్రుగ్గుటల్
కటువే యైనను శ్లాఘ్యమే యగునుగా !
కాంతా స్తనాబద్ధమై
కటియం దుయ్యాల లూగుటల్ గలిగె సౌ
ఖ్యాలంబముల్ దుఃఖముల్. 10

నీలాటి రేవు నుండి ఒక ఒయ్యారి నీళ్ల కడవ తెస్తున్నది. ఆ కడవ ఆమె ఘనస్తనాలను ఒరుసు కుంటూ నడుం మీద నాట్యం చేస్తున్నట్లున్నది. ఆ ఘటాన్ని చూస్తున్న ఒక రసఘటికుడు చేస్తున్న అన్యాపదేశ ప్రశంస ఇది.

ఓ ఘట శ్రేష్ఠమా ! నీవులోగడ కుమ్మరి చేతిలో ఎన్నో గూటపు దెబ్బలు తినటం శ్లాఘనీయమే. ఎర్రని ఎండలో ఎండిపోవటమూ నీకు గౌరవమే. బురద పాకంలో త్రొక్కిడి పడటమూ గౌరవార్హమైందే. ఇక కుమ్మరి ఆవంలోని మంటల్లో పడి మాడిపోవటం కూడ నీకు మన్ననే. ఆ తర్వాతనే కదా! నీవు ఎన్నెన్నో రంగులతో సింగారించుకున్నది. నీవు వీటన్నిటినీ ఎంతో సుఖంగా భావించి అనుభవించావు. కనుకనే ఈనాడు ఇంత అందమైన అతివల సుతిమెత్తని బాహులతికల మధ్యలో హాయిగా ఉన్నావు. వారి స్తనపార్శ్వాలను ఒరుసుకుంటూ నడుముల మీద ఒయ్యారాలు పోతున్నావు. ఉయ్యాల లూగుతున్నావు. సుఖిస్తున్నావు. ఈ నాటి నీ సుఖాలన్నీ ఆ నాటి కష్టాలకు ప్రతి ఫలాలే.

ఇతడిది అభిలాషా విప్రలంభం. ఇది దర్శన శ్రవణాల వల్ల కలుగుతుంది. తత్రాపి ఆనందాశ్చర్యాలు కలుగుతాయి. ఘటంలాగా తానుకూడా ఆ సౌందర్య లహరి దేహానికి అంటుకు పోవాలని స్పర్శ సుఖాన్ని కోరుకుంటున్నాడు. అందుకు ఎన్ని కష్టాలైనా అనుభవించటానికి సిద్ధమే. ప్రేమ కష్టాలను లెక్కపెట్టదు కదా! ప్రస్తుతం మానసిక రతి సౌఖ్యాన్ని పొందుతున్నాడు.

శార్దూలం

కిం కిం వక్త్ర ముపేత్య చుంబసి బలాత్
నిర్లజ్జ ! లజ్జా న తే ?
వస్త్రాన్తం శఠ ! ముంచ ముంచ శపథైః
కిం ధూర్త వాగ్బంధనైః ।
ఖిన్నాహం తవ రాత్రి జాగరతయా
తామేవ యాహి ప్రియాం
నిర్మాల్యోజ్ఝిత పుష్పదామనికరే
కా షట్పదానాం రతిః ? ॥

శా॥ ఏలా ? మోమున మోము నుంచి గదియన్ ?
ఏ మైన సిగ్గున్నదా ?
ఏలా ? పైట చెరంగు లాగ ? విడుమో
యీ ధూర్త ! వాగ్బంధనా
లేలా ? దస్సితి నిద్రలేమి నిశి, పో
మ్మీ నీ ప్రియం జేరగా !
ఏలా మెచ్చును ? వాడివత్తలగు పూ
లిందిందిరా లో శఠా !

పరాంగనా సౌఖ్యాన్ని పొంది వచ్చిన ధృష్ట నాయకుడిని చూచి, తనను ముట్టుకొన వద్దని కోపంతో బెదిరిస్తున్న ఖండిత నాయికా విషయం.

సిగ్గులేని వాడా ! బలాత్కారంగా ముఖం మీదకు వచ్చి ముద్దాడ బోతా వేమిటి ? సిగ్గు లేదూ నీకు ? అరె ! పోతుంటే కొంగుబట్టి లాగుతా వేమిటి ? వదులు ! ఊఁ ! వదులు. పచ్చి మోసగాడా ! కల్లబొల్లి కబుర్లతో ముందరి కాళ్లకు బంధాలేస్తావెందుకు ? నీ ఒట్లూ వారాలూ అన్నీ అబద్ధాలేగా ! వీటితో ఏమైతుంది? ఆచరణలో అంతా శూన్యమేగా ! నీకోసం ఎదురు చూస్తూ రాత్రంతా నాకు జాగారమేగా ! దుఃఖంతో ఖిన్నురాలనైనాను. అలసి పోయాను. ఇక చాలు. ఇక ఆ నీ ప్రేయసి వద్దకే పో ! ఎందుకంటే వాడి వత్తలైన పూల దండలను ఏ తుమ్మెదలు కోరుకుంటాయి?

నాయకుడు పరాంగనతో గడిపిరావటంతో రతికి అయోగ్యుడైనాడు. రాత్రంతా అతడి కోసం ఆమె నిరీక్షించింది. వసివాడి రసహీనమైంది. అన్యస్త్రీ భోగ చిహ్నాల ప్రత్యక్ష సాక్ష్యం వల్ల ఆమెకు నాయకుడిపట్ల బాధ దుఃఖంతో కూడిన ఈర్ష్య పుట్టుక వచ్చింది. ఈ విధమైన ఈర్ష్య వల్లా మదన భావం వల్లా విప్రియం కలుగుతుంది. దానితో కోపమూ వస్తుంది. వైమనస్యమూ ఏర్పడుతుంది. ఇక రాత్రంతా తానేమి తక్కువ తినలేదని ఆమె మాటలలో ధ్వనించటం ఇక్కడి కొసమెరుపు కాగా, నిర్మాల్యోజ్ఝిత పద ప్రయోగం వల్ల శృంగారాన్ని పవిత్ర విషయంగా కవి పరిగణించినట్లు స్పష్టమైతున్నది.

శార్దూలం

వాణిజ్యేన గతః స మే గృహపతిః
వార్తాపి న శ్రూయతే
ప్రాతస్తజ్జననీ ప్రసూత తనయా
జామాతృ గేహం గతా ।
బాలాహం నవయౌవనా నిశి కథం
స్థాతవ్య మేకాకినీ ?
సాయం సంప్రతి వర్తతే పథిక హే !
స్థానాంతరం గమ్యతాం ॥

శా॥ వ్యాపారార్థము దూరమేగె పతి యే
వార్తల్ చెవిన్ సోక ! వ
త్తీపూటే నవసూతి కూతు గనగా
నేగెన్ గృహంబందు నే
నీ పొద్దేవిధి నుందునో యొకతెనై ?
నే జవ్వనిన్ ! బాల ! నో
యీ ! పాంథా ! చనుమా మరొక్క దరికిన్
ఇందుండి రాత్రయ్యెడిన్ !

ఇంటి ముందరి అరుగు మీద సాయం సంధ్యా సమయంలో విశ్రమించాడు ఒక చూడ చక్కని బాటసారి. అతడిని చూచింది ఆ యింటిలోని ప్రోషిత భర్తృక. మనసు శృంగార రస వాహినిగా పొంగులెత్తింది. ఆపై అతనికి తన సంభోగేచ్ఛను వ్యంగ్యంగా సూచిస్తున్న సన్నివేశం ఇది.

ఓ బాటసారీ ! నా పతి వ్యాపారం కోసం దూర దేశాలకు వెళ్లాడు. అతడెక్కడున్నదీ ఏమైనదీ ఏ సమాచారం ఇంతవరకూ లేదు. బాలెంతరాలైన తన కూతురిని చూచి రావటం కోసం మా అత్త ఈ ఉదయమే అల్లుడింటికి వెళ్లింది. నేనా బేలను. ఏమీ ఎరుగని బాలను. నవయౌవనవతిని. మరి ఈ రాత్రికి ఇంట్లో ఒంటరిగా ఉండటం ఎలాగో మరి. భయం భయంగా వుంది. సంధ్యా సమయం గడచి పోతున్నది. కనుక ఓ బహుదూరపు బాటసారీ ! ఈ చోటు వదలి మరోచోటు చూచుకో ! మంచిది !

ఈమె పరాంగన. ప్రాయపు బిత్తరి. వక్రచారిణి. మగడూళ్లో లేడు. భర్తతో బుద్ధిపూర్వక మైన ప్రవాసమే ఏర్పడింది ఈమెకు. అయినా బుద్ధి పెడతల పట్టింది. కనుకనే బాటసారిని ఇంటి ముంగిట అరుగు మీద నుండి పడకటింటిలోకి అభిసరించమని సూచిస్తున్నది. చీకటి తప్పుకు చక్కటి సంకేతాన్నీ కాలాన్నీ సూచించింది. ఈమె మంచి చతుర మాటకారి భోగాభిలాషిణి నిర్భీక. ఈమె మాటల్లో వాచ్యార్థం విధిరూపంగాను వ్యంగ్యార్థం నిషేధ రూపంగానూ వుంది. అంటే అతడిని మరెక్కడికీ వెళ్ల వద్దని భావ ధ్వని. లోనికి రమ్మనమని ఆహ్వానం. శృంగార పరిభాషలో పొమ్మంటే రమ్మనమని గదా !

మందాక్రాన్తం

యామిన్యేషా బహుల జలదై
ర్భిద్ధ భీమాంధ కారా
నిద్రాంయాతో మమ పతి రసౌ
క్లేశితః కర్మదుఃఖైః ।
బాలాచాహం ఖలు ! ఖలభయా
త్ప్రాప్త గాధ ప్రకంపా
గ్రామశ్చౌరై రయ ముపహతః
పాంథ! నిద్రాం జహీహి ॥

తే॥ జలదములు మూగె నిశి తమసమ్ము రేగె
బడలి నిదురించె నా భర్త బాల నేను
చోర భయముండె రా పాంథ ! ఊరిలోన
వణకు పుట్టుచు నుండె పోవలదు నిదుర.

13

అది వర్ష కాలపు రాత్రి. ఇంటి వసారాలో ఒంటరిగా నిద్రిస్తున్నాడు పరమ సుందరుడైన పరదేశి. మంచి నిద్రవేళ ఆ యింటిలోని తరుణి లేచింది అతడిని లేపింది తమకంతో. నర్మగర్భంగా ఆహ్వానించింది తనకు జంటగా పడకింటిలోనికి రమ్మనమని. ఇదీ ఆమె వరస !

ఓయీ బాటసారీ ! ఈ రాత్రి ఆకాశంలో మబ్బులు దట్టంగా ముసిరాయి. అంతటా గాఢాంధకారం అలుముకుంది. పగలంతా కాయకష్టం చేసి నాపతి అలసిపోయాడు. ఇక్కడే పడి మొద్దు నిద్రపోతున్నాడు. నాకెవ్వరూ తోడు లేరు. అనాథను. అసలేమీ తెలియని బేలను. అబలను. నాకేదో భయం భయంగా వుంది. ఇటు చూస్తే దుష్టుడైన మన్మథుడు ! అటు చూస్తే ఊళ్లో తిరిగే దొంగలు. వణుకు పుడుతున్నది ! కనుక ఓ బాటసారీ ! ఈ రాత్రికి నిద్రపోవద్దు.

భర్త బడలికతో నిద్రించటం వల్ల ఈమెకు తాత్కాలిక వియోగం కలిగింది. భర్త బద్ధకస్తుడు అతినిద్రాలోలుడు అజాగ్రత్తపరుడూ కావటమే ఈమె ఈ ప్రవర్తనకు మూలం. తరుముకొని వస్తున్న మబ్బులు కురుస్తున్న వాన క్రమ్ముతున్న చీకట్లు, భర్త అతి నిద్రాలోలత, ఆమెలోని ఒంటరితనం, నవ మన్మథుడైన పాంథుడి చక్కదనం ఈమెకు ఉద్దీపన లైనాయి. ఆమెను తొందరచేస్తున్నాయి. అందువలన ఈ ఖలరతికి అభిలషిస్తున్నది. ఆ చీకటిలో చీకటి తప్పుకు సిద్ధపడింది. అందుకు ఏవేవో కుంటి సాకులను అన్యాపదేశంగా చెప్పి భయాన్ని నటిస్తున్నది. వ్యంగ్యంగా బాటసారి భయాన్ని వారిస్తున్నది. పరాంగనలపట్ల నిర్భయ సంభోగం హానికరమని ఆమెకు తెలుసు. అందువల్లనే చక్కని సంకేతాన్ని కూడ సూచిస్తున్నది. ఇక నిద్రపోవద్దని మదనకుతూహల రాగాన్ని ఆలపిస్తున్నది.

శార్దూలం

క్వ భ్రాత శ్చలితోऽసి వైద్యక గృహే
కిం తద్రుజాం శాన్తయే
కిం తే నాస్తి సఖే గృహే ప్రియతమా ?
సర్వం గదం హన్తి యా ।
వాతం తత్కుచకుంభ మర్దన వశాత్
పిత్తం తు వక్త్రామృతాత్
శ్లేష్మాణం వినిహన్తి హన్త సురత
వ్యాపార కేలి శ్రమాత్ ॥

తే॥ ఎక్కడకు తమ్ముడా ? వైద్యునింటి ! కెందు
కో ? తెవులు వోవ ! నింటలేదా సతి ? రోగ
హారి ! పిత్తవాతశ్లేష్మహారు లధర
పాన కుచ మర్దన రతులు ! వైద్యుడేల ?

తన మిత్రుడు రోజు రోజుకూ క్రుంగి కృశించి పోవటం ప్రియావిరహం వల్లనే నని గ్రహించాడు ఓ రసజ్ఞ మిత్రుడు. ఆ రోగ నిదానానికి మధురమనోజ్ఞమైన మైథున వైద్య విధానాన్ని సూచిస్తున్నాడు. ఆ మిత్రుల సంభాషణ వాకోవాక్య రూపంలో నడిచింది.

ప్రశ్న : ఏం తమ్ముడూ ఎక్కడికి నీ ప్రయాణం ?

సమా : వైద్యునింటికి

ప్రశ్న : ఎందుకూ ?

సమా : ఒంట్లో నలతగా వుంది

ప్రశ్న : సహధర్మచారిణి సర్వరోగ హారిణి ప్రేయసి. నీ ప్రియురాలు ఇంట్లో లేదా ?

మిత్రమా ! వాత దోషం అయితే ఆమె స్తనమర్దనం వల్ల హరిస్తుంది. పిత్త దోషం అయితే ప్రియురాలి అధరపానం వల్ల నశిస్తుంది. శ్లేష్మదోషం అయితే ఆమెతోటి సురతక్రీడా పరిశ్రమం వల్ల తగ్గిపోతుంది. అందువల్ల ఆమెతో సుఖించు అన్ని రోగాలూ అవే పోతాయి.

ఈ చిట్కాలన్నీ మహామదన వ్యాధికి సిద్ధ మకరధ్వజ సదృశాలు. కమ్మటి రోగాలకు తియ్యటి మందులు. మగటిమి గల వారికి మగువల పొందే సర్వదా సర్వరోగ నివారక మార్గం. ఆరోగ్య మహాభాగ్యా లెప్పుడూ స్వీయకాంతా సేవలోనే లభిస్తాయి. అది ఎంతో మధురం. దంపతులకు ఎక్కువకాలం ఎడబాటు పనికిరాదనీ అలా అయితే హాయిలేదని ఆ రసజ్ఞ మిత్రుడి రసవాదం. కులకాంతతో కలిసి రసరమ్య లోకాలలో తేలిపోవాలని అతని హితబోధ. అంటే కౌలీన శృంగారాన్ని మించిన ఔషధరాజం మరొకటి లేదని భావం.

శార్దూలం

యత్త్వన్నేత్ర సమాన కాంతి సలిలే
మగ్నం తదిందీవరం
మేఘై రంతరితః ప్రియే తవ ముఖ
చ్ఛాయానుకారీ శశీ।
యేఽపి త్వద్గమనానుసారి గతయ
స్తే రాజహంసా గతాః
త్వత్సాదృశ్య వినోదమాత్ర మపి మే
దైవేన న క్షమ్యతే ॥

ఉ॥ నీట మునింగె నీ కనుల
నిగ్గుల బోలిన నల్ల కల్వ, లా
గాటపు మేఘముల్ ముసరె
గా ముఖబింబముబోలు చంద్రునిన్
నీటు చెలంగు నీ నడల
నేర్చు మరాళము లేగె ! భామ ! నీ
సాటికి వచ్చు దృశ్యముల
సంతస మందగ దైవ మోర్వదే ! 15

ఒక ప్రవాసి ప్రకృతి సౌందర్య దర్శనంతో ప్రియురాలిని స్మరించుకుంటూ ఎలాగో అతి కష్టంమీద కాలాన్ని వెళ్లదీస్తున్నాడు. కానీ వానకాలం వచ్చేసరికి ఆ భాగ్యానికి గూడ దూరమైనానని తన హృదిలోని ప్రేయసితో వాపోతున్నాడు.

ఓ ప్రియా ! నీ కనుల కాంతితో సమానమైన కలువపూలు వాన నీటిలో మునిగి పోయాయి. నీ ముఖ శోభను అనుకరించే చందమామ కన్పించ కుండా కారుమబ్బులు క్రమ్ముకున్నాయి. నీ అందమైన మందగమనాన్ని అనుసరించే రాజ హంసలు నిర్మలమైన మానస సరోవరానికి తరలిపోయాయి. ఇంత కాలంగా వాటి అన్నింటిలో నిన్ను చూచుకుంటూ జీవించాను. కానీ నాకు దక్కిన ఆ కొద్దిపాటి సంతోషాన్ని చూడటానికి కూడ ఆ భగవంతుడికి ఓర్పు తక్కువైంది.

ప్రియా పారవశ్యంలో ప్రవాసికి ప్రకృతి సౌందర్యం అంతా ఆమె అవయవాల మాదిరిగానే భాసిస్తుంది. ప్రకృతి అంతటా తన ప్రియురాలే కన్పిస్తుంది. బాధిస్తుంది. ఇక ప్రకృతిలో ప్రియురాలిని చూచి ఆమె స్మరణంతో పలవిస్తాడు. అందులోనే ఆమె సౌందర్యాన్ని ఆరాధిస్తాడు. గుణ కీర్తనం చేస్తాడు. అందుకూ విఘాతం కలిగితే విలపిస్తాడు. ఆ క్రోశిస్తాడు. ఆ దైవాన్నైనా నిలదీస్తాడు. ఇదంతా విప్రలంభ శృంగారంలో సంగతి. వియోగ వేదనతో నిర్వేదం కలుగుతుంది. అది దైవోపాలంభనకు దారి తీస్తుంది. ఇది వర్ష ఋతువులోని నాయక విరహ వేదన వలన కలిగిన నాయికా సౌందర్య స్మరణావేశ సన్నివేశం.

శార్దూలం

చంద్ర శ్చండకరాయతే మృదుగతి
ర్వాతోఽపి వజ్రాయతే
మాల్యం సూచి కులాయతే మలయజా
లేపః స్ఫులింగాయతే ।
ఆలోక స్తిమిరాయతే విధివశాత్
ప్రాణోఽపి భారాయతే
హా ! హంత ప్రమదా వియోగ సమయః
కల్పాంత కాలాయతే ॥

ఉ॥ శీతకరుండు సూర్యుడును
శీతల వాయువు వజ్ర మింక మై
పూతలు విస్ఫులింగములు
పూవులు ముల్కులు లోకమే తమం
బై తుద కూర్పు గూడ బరు
వయ్యెగదా ! విధి ప్రేరణంబునన్
హా! తరుణీ వియోగ సమ
యంబు లయంబగు కాలమౌ గదా ! 16

ప్రవాస కాలంలో ప్రియా విరహంతో వేగి పోతున్నాడు ప్రియుడు. విరహ సమయం అతడికి విలయకాలంగా వుందని తల్లడిల్లిపోతున్నాడు.

నాకు ఈ ప్రియా వియోగ సమయం క్షణమొక యుగంగా వుంది. ప్రళయకాలంలాగా భయం భయంగా వుంది. చంద్రుడి చల్లని కిరణాలు ప్రళయ భానుడి చండ కిరణాలై తాపాన్ని పుట్టిస్తున్నాయి. చల్లని మందమారుతాలు సైతం వజ్రఘాతాలై వేధిస్తున్నాయి. పరిమళాలు వెదజల్లే పూల మాలలు వాడి సూదుల్లాగా గుండెలోతుల్లో గుచ్చుకుంటున్నాయి. మంచి గంధపు లేపనాలు కణకణలాడే అగ్ని కణాలై ఒళ్లంతా మంటలు పుట్టిస్తున్నాయి. లోకం అంతా అంధకార బంధురంగా వుంది. వెలుగులో కూడా ఏమీ కన్పించని వెతుకులాటగా వుంది. అయోమయంగా వుంది. మనసు పనిచేయటం లేదు. ఉన్న కొద్దీ ఊపిరి పీల్చటం కూడ భారంగా వుంది. ప్రియురాలి విరహం ఒక ప్రళయంగా వుంది.

నాయక వియోగ వ్యథ ఇది. నాయిక లేకుంటే అతడికి అంతా విభ్రాంతి. ప్రకృతిలోని శృంగార ఉద్దీపనలన్నీ విరహాగ్నిని ప్రజ్వలింపచేస్తాయి. మనశ్శరీరాలకు మంటపుట్టిస్తాయి ప్రవాస విరహికి. ఇది శరత్కాల సౌరభాలతో అతిశయించిన విరహవేదన.

ఉపేంద్ర వజ్ర

ప్రాణేశ ! విజ్ఞప్తి రియం మదీయా
తత్రైవ నేయా దివసాః కియంతః ।
సంప్రత్యయోగ్య స్థితి రేష దేశః
కరా హిమాంశో రపి తాపయంతి ॥

తే॥ నాథ ! వినుమోయి విజ్ఞప్తి నాది యొకటి !
అందె కొన్నాళ్లు గడుపు మానందముగను !
ఇందు యోగ్యంబుగాదు ! రా తొందరేల !
పందు వెన్నెల సైతంబు మండు నిచట !

ప్రవాసంలోవున్న తన భర్త అనుకున్న సమయానికి రాలేదు. అందుకు ఆ యిల్లాలు విరహోత్కంఠతో మరగిపోయింది. అప్పటి తన విరహ స్థితిని భర్తకు నర్మగర్భంగా విన్నవించుకుంటూ సందేశం పంపుతున్నది.

ఓ నా ప్రాణేశా ! నా ఈ విన్నపాన్ని మన్నించండి. మీరింకా కొన్ని రోజులు అక్కడే వుండండి. ఈ ప్రదేశం మీ కిప్పుడు నివాసయోగ్యంగా లేదు. ఎందుకంటే ? చంద్రుడి సహజ శీతల కిరణాలు సైతం ఇక్కడ తీవ్రమైన తాపాన్ని కల్గిస్తున్నాయి. కనుక మీకు అక్కడే హాయిగా వుంటుంది. ఉండండి. ఇప్పుడల్లా రాకండి. సరేనా !

పరువంలో వున్న కులకాంతను ఇన్ని రోజులు ఇలా ఇంట్లో ఒంటరిగా వదిలిపెట్టి పోవటం ఎవరికీ సుఖకరం కాదని, సమంజసం కాదని, మర్యాదకాదని, కనుక తొందరగా రమ్మని వ్యంగ్యోక్తి. భర్త తన భార్యను అనురాగంతో అనుసరించి వుండాలి గాని, అదేపనిగా సంపాదన కోసం పరదేశాలు పట్టి పోరాదని, ఆమెను కామభావంతో కనలి పోనివ్వరాదని సంద్దేశం. ఈ సందేశంలో కార్యనిర్దేశం వుంది. వ్యాజ రూపంగా పతి ఆగమనాభిలాషను వ్యక్తం చేసింది. మధుర సుఖాన్ని కాంక్షించింది. ఇది వ్యపదేశ లక్షణం. తన వద్దకు రావద్దన్న ఆ భార్యామణి సందేశానికి రమ్మనమని వ్యంగ్యార్థం. వక్రోక్తితో ఆమె తన విరహాతిశయాన్ని వ్యక్తీకరించింది. స్త్రీజన సహజమూ సౌందర్య సందీపితమూ అయిన వక్రవాగ్విన్యాసాన్ని ప్రదర్శించింది.

వసంత తిలకం

కల్యాణి ! చందన రసైః పరిషిచ్య గాత్రం
ద్వి త్రీ ణ్యహాని కథ మప్యతి వాహయేథాః ।
అంకే నిధాయ భవతీం పరిరభ్య దోర్భ్యాం
నేష్యామి సూర్యకిరణా నపి శీతలత్వం ॥

ఉ॥ శీతల చందనాది రస
సేచనతో తనుదాహ మోర్వలే
వే ? తడవుండ నోప ! నిజ
మిక్కడ నుండెద రెండు మూడు నా
ళ్లో తరుణీ ! క్షమింప దగ
నో ! కను మంకము చేర్చి కౌగిటన్
నీ తనుతాప మార్పెదను
నీరజ బంధుని తాప మార్పెదన్. 18

ఇక వీసమెత్తు కూడా విరహాన్ని భరించ జాలనని భర్తకు సందేశం పంపింది భార్యామణి. ఆమెను కొద్ది రోజుల పాటు శీతల గంధాలతో మదన తాపం నుండి ఉపశమనం పొందమని ప్రతి సందేశం పంపుతున్న పతి దేవుడి వైనం ఇది.

ఓ కళ్యాణీ ! నీ శరీరానికి చల్లని చందన రస లేపం పూసుకో. శరీరాన్ని చల్ల బరచుకో. నీ విరహాగ్నిని ఉపశమింపజేసుకో. ఎలాగో రెండు మూడు రోజులు ఓపిక పట్టు. ఈ లోగా నేను రానే వస్తాను. ఒడిలోకి తీసుకుంటాను. గాఢాలింగనం చేసుకుంటాను. ముద్దూ ముచ్చట తీరుస్తాను. అప్పుడు చంద్రనిప్పుల వంటి చండ ప్రచండమైన సూర్య కిరణాలను సైతం శీతలంగా మారుస్తాను. అంత దాకా కొద్దిగా నిదానించు. సహించు.

ఇతడు అనుకూల నాయకుడు. ఆమె విరహోత్కంఠిత. వీరిది ప్రౌఢమైన స్నేహం. విరహ సమయంలో ఉద్దీపనలన్నీ వీరికి విషాద వీచికలే. విహార సమయంలో నయితే పగలే వెన్నెల జగమే ఊయల. ప్రొద్దే తెలియదు. అదే భాగ్యం, అదే స్వర్గం. అదే విరహవేళలో నయితే అంతా వ్యతిరిక్తమే. అయినా వారి ప్రేమలో ఎప్పుడూ ఏలోపమూ ఏ దోషమూ వుండదు. అది స్థిరంగానూ స్నిగ్ధ మనోహరంగానూ వుంటుంది. మధురానందంగానూ వుంటుంది. ఇందులో భార్యను ఓదార్చే తీరు గమనించాలి. ఇందులోని నాయికకు విరహదాహంతో పాటు వేసవి తాపం తోడైంది. అది శీతలోపచారాల వల్ల ఉపశమిస్తుందని అతని ఆశ ! పాపం !

వసంత తిలకం

అంతర్గతా మదనవహ్ని శిఖావలీ యా
సా బాధ్యతే కిమిహ చందన పంకలేపైః ।
య త్కుంభకార పచనోపరి పంకలేపః
తాపాయ కేవల మసౌ న చ తాపశాన్త్యై ॥

తే॥ మన్మథాగ్ని లోలోపల మండుచుండ
చందనాదుల దేహంబు చల్లనగునె ?
అరయ నావపు పైపూత లాపగలవె
కుండ నంటకుండ సెగల ? కుముల జేయు ! 19

శీతలోపచారాలతో కొద్దికాలం విరహతాపం నుండి ఉపశమనం పొందమని పతిసందేశం పంపించాడు. దానికి ఆ ప్రోషిత భర్తృక ప్రతిస్పందన ఇది.

హా! ప్రియతమా ! మీ మాటలలోని భావం నాకు బోధపడక పోలేదు. అయినా కామాగ్ని కీలలు నన్ను లోలోపల దహింప చేస్తున్నాయి. మీరు చెప్పిన రీతిగా శీతల చందన గంధాల మైపూతలవల్ల లోపల రగులుతున్న దుస్సహతరమైన కామాగ్ని ఎలా చల్లబడుతుందో ! అది మీరే సెలవియ్యండి. కుమ్మరి ఆవం మీద వేసిన పైపూతలు ఆవంలోపల రగిలే మంటలను ఆర్పివేయగలవా ? అలా ఎప్పటికీ జరగదు. పైగా ఆవంలోపల వున్న మృణ్మయ పాత్రలను బాగా కాలుస్తాయి. అలాగే ఇప్పుడు నాదేహం కుమ్ములో పడినట్లయింది.

కామ దాహంతో సెగలు చిమ్ముతున్న పొగలేని పొయ్యి ఆమెదేహం. పతి చెంత లేకుండా అది ఎలా శాంతిస్తుంది ? పనికిమాలిన సలహాలు మానుకొని వచ్చి విరహతాపాన్ని శాంతింపచేయమని ఆమె వ్యంగ్య భాషణలోని శృంగారాభ్యర్థన. అదే ఆమె ప్రతి సందేశం. ఇది ఆమె దుఃఖోద్భావనపర మైంది. విరహిణీ విలాప ధోరణి ఇది. పతి చేసిన సూచన వలన కలిగిన కోప విస్మయ బాధాజనితమైన కామధ్వనితో తన మనోభీష్టాన్ని వెల్లడించింది ఆసతి.

మందాక్రాంతం

దృష్ట్వా యాసాం నయన సుషమా
మంగ వారాంగనానాం
దేశ త్యాగః పరమ కృతిభిః
కృష్ణసారై రకారి ।
తాసా మేవ స్తనయుగజితా
దంతిన స్సంతి మత్తాః
ప్రాయో మూర్ఖాః పరిభవ విధౌ
నాభిమానం త్యజంతి ॥

తే॥ వారవనితల నయన శోభలను గాంచి
లేళ్లు తెలివిగా దేశంబు లెత్తిపోయె
కరులు మత్తిల్లె స్తనముల ఘనత నోడి
హీను లభిమానపడ రవమాన పడియు. **20**

వేశ్యాలోలుడై వారి సౌందర్యానికి దాసుడై వారితోటిదే లోకంగా వెంట తిరుగుతున్న తన మిత్రుణ్ని అప్రమత్తం చేస్తున్నా డొక విషయజ్ఞుడు. అప్రస్తుత ప్రశంసతో మందలింపుతో కూడిన అతని హితోక్తి ఇది.

మిత్రమా ! వేశ్యల అందమైన కనుల కాంతులను చూచిన మృగాలు సైతం వారి వద్ద నుండి పారిపోతున్నాయి. అంటే అమాయకపు లేళ్లు కూడ తెలివి తెచ్చుకొని దేశం విడిచి వారికి దూరంగా తొలగిపోతున్నాయి. నేత్ర సౌందర్య విషయంలో లోకంలో తమకున్న పరువు కాస్తా కరిగి పోతుందని వాటి భయం. కానీ ఏనుగులు మాత్రం తమ కుంభ స్థలాలు వేశ్యల ఘన స్తనాలతో పోటీపడి ఓడిపోయినా కూడా సిగ్గుమాలి ఇక్కడే పడివుండి మదిస్తున్నాయి. కారణం ఏమిటంటే ! సహజంగా మూర్ఖులు వారికి జరిగిన అవమానాలకు బాధపడరు. వారి దురభిమానాన్ని విడిచిపెట్టరు. తామే గొప్పవాళ్లమని విర్రవీగి తిరుగుతుంటారు.

మదించిన ఏనుగుల లాగా కాకుండా, బక్కచిక్కిన లేళ్ళలాగా చక్కని వివేకం కలిగి, వేశ్యలకు దూరంగా పరువుగా బ్రతుకమని మిత్రుని హితబోధ. వేశ్యల తనూవిలాసం కాముకుల్ని అవివేకుల్ని చేసి ఎలా కట్టి పడవేస్తుందో, వారిని కామదాసులుగా ఎలా మారుస్తుందో దాని పరిణామ మేమిటో ఈ మిత్రవాక్యం వివరించింది.

శార్దూలం

గాఢాలింగన పీడిత స్తనతటం
స్విద్యత్కపోలస్థలం
సంద ష్టాధరముక్త సీత్కృత మభి
భ్రాన్త భ్రు నృత్యత్కరం ।
చాటు ప్రాయవచో విచిత్ర మణితం
ఘూతైః రుతై శ్చాంకితం
వేశ్యానాం ధృతిధామ పుష్పధనుషః
ప్రాప్నోతి ధన్యో రతమ్ ॥

శా॥ గాఢాలింగన మర్దిత స్తనములున్
ఘర్మార్ద్ర గండంబులున్
పీడన్ స్వాధరముక్త సీత్కృతములున్
భ్రూహస్త నృత్యంబులున్
వ్రీడల్ వాక్యవిలాసముల్ మణితముల్
ప్రేమంపు కోపంబులున్
చూడన్ వేశ్యలు పంచబాణ సుఖముల్
జోడైన ధన్యుండగున్.

వేశ్యారతిలోని విశేషాన్నీ మధుర్యాన్నీ అనుభవించిన వాడే అసలైన భాగ్యశాలి, జన్మంటే వాడిదే నంటూ తన మిత్రుణ్ని ఊరిస్తూ ప్రేరేపిస్తున్న ఒక రతి పండితుడి రసప్రవచనం ఇది.

వేశ్యల ఒత్తైన విత్తైన స్తనమండలం సంభోగ సమయంలో పారవశ్యంతో బాగా మర్దింప బడుతుంది. వారి చక్కని చెక్కిళ్లు సాత్త్విక భావంతో చెమరుస్తాయి. దంత క్షతాల బాధకు క్రింది పెదవి నుండి మధురమైన సీత్కృతధ్వని వినిపిస్తుంది. రతిబాధా సౌఖ్యంతో వారికి భ్రుకుటి ముడిపడుతుంది. నాట్యముద్రల లాగా చేతులు అడ్డంపెడతారు. మధ్య మధ్యలో తియ్యటి మాటలతో మత్తెక్కిస్తారు. ఆనంద పారవశ్యంతో మణితం అనే రతికూజితాలు చేస్తారు. ప్రణయకోపాన్ని ప్రదర్శిస్తారు. దొంగ ఏడుపులు ఏడుస్తారు. అవి అన్నీ విటుడి హృదయంలో మధురంగా ముద్రపడిపోతాయి. ఆ వేశ్యా సంగమం అవ్యక్త మధురమైన మన్మథ సుఖాల నిధానం. అందువల్ల వారిని పొందిన వాడే ధన్యుడు. రసిక జన మూర్ధన్యుడు.

ఇది వేశ్యా సురతవర్ణనం. వేశ్యలు మన్మథ వహ్నికీలలు, వారు చక్కని వేషాన్ని ధరిస్తారు. వారు అందచందాలకు ఆలయాలు. కామశాస్త్ర ప్రవీణలు, శృంగార రణధీరలు. ప్రగల్భలు. హరనేత్రాగ్ని కీలల్లో భస్మీ భూతుడైన మన్మథుడు వేశ్యల చూపుల వల్లనే మరల జీవించాడంటారు. వారు కళా వైదగ్ధ్యాలకు నెలవులు. శృంగార రస వాహినిలో మునిగిన వారి సీత్కారాలు మయూర మరాళ పారావత ధ్వనులను పోలి వుంటాయి. వేశ్యలతోడి దైన క్రియా శృంగార మాధుర్యం, ఆనాటి పురుష పుంగవుల విలాస జీవన సౌందర్యం. ఇక సామాజికంగా చూస్తే వేశ్యాగమనం నీతి బాహ్యం, వారు ప్రదర్శించే ప్రేమ విటులు సమర్పించుకొనే ధన కనక వస్తు వాహనాల మీదే. అంతా నటనే, వారితోడి సరసం శృంగార రసాభాసమే నంటారు మరి కొందరు. అది సర్వాపదలకు సంస్థాన మంటారు.

వసంత తిలకం

మత్తేభకుంభ పరిణాహిని కుంకుమార్ద్రే
కాంతా పయోధర యుగే రతిఖేదఖిన్నః ।
వక్షో నిధాయ భుజపంజర మధ్యవర్తీ
ధన్యః క్షపాం క్షపయతి క్షణలబ్ధ నిద్రః ॥

తే॥ మత్తమాతంగ కుంభ సమానములును
కుంకు మార్ద్రములగు ప్రియ కుచములందు
వక్షముంచి హాయిగ భుజ పంజరాన
క్షణము నిద్రింప ధన్యుడౌ క్షణద యందు. 22

ప్రియా సంభోగానంతరం బడలి పోయిన శృంగార యోధుడు శృంగార రస సర్వస్వమైన తన ప్రియురాలి వక్షఃస్థలం మీద ఒక్కింతసేపు విశ్రమించటంలోని పరమ సుఖాన్ని, తన రత్యనుభవసారాన్ని శాస్త్ర రహస్యంతో రంగరించి ఒక రసజ్ఞ మిత్రుడు మనోజ్ఞంగా వివరిస్తున్న సన్నివేశం.

రతి పరిశ్రమానంతరం, మదించిన ఏనుగుల కుంభస్థలాల లాగా ఉన్నతంగాను కఠినంగాను వుండి, కుంకుమ పూల పుప్పొళ్లతో నిండి సువాసనలు గుబాళిస్తూ చల్లగా వుండి, కాశ్మీరదేశంలోని కుంకుమాద్రిలాగా ఎర్రగా అనురాగ రంజకంగా వుండేలా సింగారించుకున్న తన ప్రియురాలి స్తనమండలం మీద తన వక్షఃస్థలాన్ని మోపి, ఆమె బాహుపంజరంలో ఆదమరచి సుఖనిద్రలో ఒక్క క్షణకాలమైనా గడపగలగాలి. అటువంటి శృంగార సుఖయోగం పట్టిన వాడే అసలైన భాగ్యశాలి. వాడే రసికరాజ శిఖామణి.

ఇది సంభోగ శృంగార సంబంధి. కామ మోక్షానికి సంభోగం ఒక్కటే చక్కని రాజమార్గం. అది విరిసిన రస భావాలతో చౌశీతి బంధాల రతికౌశలంతో ఆనందించటమూ రత్యంతంలో ప్రియురాలి వక్షఃస్థలం మీద విశ్రమించటమూ. ఇలా మదన తంత్రంలో అత్యంత మనోహరమైన సన్నివేశం. దీన్నే నారీకుచాభోగానందైక రసపారవశ్యం అని కొందరంటారు. ఏమైనా సహృదయుల కిది రసరాజ సహయోగం.

వసంత తిలకం

హే! రోహిణి ! త్వ మసి రాత్రికరస్య భార్యా
ఏనం నివారయ పతిం సఖి దుర్వినీతం ।
జాలాన్తరేణ మమ వాసగృహం ప్రవిశ్య
శ్రోణీతటం స్పృశతి కిం కులధర్మ ఏషః ? ॥

తే॥ మేలె రోహిణి ! చంద్రునిల్లాల చెపుమ !
భర్త దుర్నీతి కృత్య మాపంగ లేవా !
కిటికిలో దూరి నా పడకింట చేరి
పిరుదు లంటును ! కుల ధర్మ విధమె యిద్ది ? 23

శృంగార నిధిలాంటి తన శ్రోణీ భాగాన్ని చంద్రకిరణాలు స్పృశించాయి ఒక విరహిణికి. ఆ స్పర్శ పరనాయక కరస్పర్శగా భావించి త్రుళ్లి పడింది. మండి పడింది ఆ మదన మంజరి. చంద్రుడిని అతడి భార్య రోహిణి ముందు జారుడిగా దోషాకరుడిగా నిలదీసింది.

ఓ సాధ్వీ శిరోమణీ రోహిణీ ! రాత్రుల కధిపతి అయిన చంద్రునికి నీవు ఇల్లాలివి. ఆపై ప్రియురాలివి. మధుర హృదయ బంధానివి. నీ భర్త దుర్నీతిని నివారించు. అతడి దురాచారాన్ని నిర్మూలించు, చూడు ! మా యింటి కిటికీలో నుంచి నా పడకటింటిలోకి ప్రవేశించాడు నీ పతి. అంతేకాదు నిద్రిస్తున్న సమయంలో నా జఘనభాగాన్ని సుతారంగా స్పృశిస్తూ మీది మీదికి ఎగబ్రాకుతున్నాడు. ఇదేమైనా పరువున్న వాళ్లు చేసే పనేనా ? చెప్పు. సద్వంశానికీ సదాచారానికీ ఇది ధర్మంగా వుందా ?

ఇది ఒక విరహిణి చేసిన చక్కని చంద్రోపాలంభన. చంద్రునిలో జారలక్షణాల్ని ఆరోపించింది. వెన్నెల విరబూస్తుంటే విరహులకు మదనతాపం పరిమళిస్తుంది. దేహాన్ని దహిస్తుంది. స్త్రీల జఘన భాగం కామకళాసాధనమూ మన్మథ మహాసనమూ. ఆ జఘన భాగాన్ని ప్రియుడు స్పృశిస్తే కామాతిరేకంతో పులకరిస్తారు, ఎగిసిపడతారు. ఇతరులు తాకితే మండిపడతారు, ఎగిరి పడతారు. ఇక ప్రవాసంలో వున్న కులీనలు విరహవేదనకు లోనైతారు. అంతే కాని, కుల మర్యాదలు తప్పరని భావం. అలాగే వారు తమతమ భర్తలను ఒక కంట కనిపెట్టి వుండాలని కూడా హెచ్చరిక.

మాలిని

అవిదిత సుఖదుఃఖం నిర్గుణం వస్తుకించి
జ్జడమతి రిహ కశ్చిన్మోక్ష ఇత్యాచ చక్షే ।
మమ తు మత మనంగ స్మేర తారుణ్య ఘూర్ణ
న్మద కల మదిరాక్షీ నీవిమోక్షో హి మోక్షః ॥

తే॥ అవిదిత సుఖదుఃఖమె మోక్షమని యగోచ
రమని గుణరహితమని యరసికు లంద్రు
మదనుని చిరునవ్వులు గల మత్తుకనుల
మగువ నీవిమోక్షమె మోక్షమందు నేను. 24

శృంగార వీరపురుష డొకడు మోక్షం అనే పదాన్ని తనదైన శైలిలో నిర్వచిస్తున్నాడు. అలాగే వేదాంత నిర్గుణ సిద్ధాంతాలను శృంగార భాష్యంతో పరాస్తం చేస్తున్నాడు.

మోక్షం అంటే సుఖదుఃఖాలకు అతీతమైందీ. అది అగోచరమైందీ. గుణరహితమైంది, అంటూ కొందరు ఏవేవో అర్థంకాని వ్యర్థమైన వ్యాఖ్యలు చేస్తుంటారు. వాళ్లు మహామూర్ఖులు. జవ సత్వాలు లేని వాళ్లు, చేతగాని వాళ్లు, అరసికులు. మరి నాదృష్టిలో మోక్షమంటే మదనోద్రేకంతో ఎగసిపడేదీ, చిరునవ్వులతో చిత్తాన్ని చిలికేదీ, అందచందాలతో మనసును మరగించేదీ, మత్తుకళ్లతో చిత్తుచేసేదీ అయిన చిన్నదాన్ని ఒద్దికగా ఒడిసి పట్టడం. ఆమెను హత్తుకుంటూ గమ్మత్తుగా పోకముడిని ఊడలాగి కైపుదించగలగడం. అంటే ప్రియురాలి నీవిబంధ మోక్షణమే మోక్షం. అదేముక్తి అదే మన్మథబాధామోక్షణం అన్నా కూడా.

నీవి మోక్షణానికి ఒక క్రమ పద్ధతి వుంది. ఆ నేర్పు అవసరమని భావం. మోక్షానందం కొందరికే తెలుసు. కానీ రత్యానందం అందరికీ ఎరుకే. కానీ కామ మోక్షపు లోతుపాతులు ఎందరికి తెలుసునని ధ్వని. అయినా కామిగానివాడు మోక్షగామి కాలేడు కదా ! అంటే ధర్మబద్ధమైన కామ శృంగారం మోక్ష శృంగారానికి మొదటి మెట్టు. మోక్ష శృంగారం అనే మహోన్నతమైన దేవళానికి ఈ కామ శృంగారం మహారాజ గోపుర ద్వారం వంటిది.

వసంత తిలకం

ఏనం పయోధర యుగం పతితం నిరీక్ష్య
ఖేదం వృథావహసి కిం హరిణాయతాక్షి ! ।
స్తబ్ధో వివేకరహితో జనతాపకారీ
యోఽత్యున్నతః ప్రపతతీతి కిమత్ర చిత్రమ్ ? ॥

తే॥ చ్యుతము లగుచున్న చనుగవ జూచుకొనుచు
వగవ నేటికి హరిణాక్షి ? వలదు వలదు !
కఠిను లున్నతుల్ జన తాపకారు లెల్ల
చ్యుతిని బొందుదు రందులో చోద్యమేమి ? **25**

శృంగార కలశాలైన తన స్తనద్వయ సౌందర్యాన్ని పదేపదే చూచుకుంటున్న మదవతి నుద్దేశించి, ఎవరికీ గర్వం పనికిరాదంటున్న ఒక కొంటె యువకుడి మాటలివి.

లేడి కన్నుల్లాంటి అందమైన పెద్దపెద్ద కన్నులున్న చిన్నదానా ! నీ సుందరమైన పయోధరాలు క్రిందికి జారిపోవటాన్ని ఎందుకలా తదేకంగా చూచుకుంటున్నావు ? అనవసరంగా ఎందుకలా దిగాలు పడతావు ? బాధ పడ వలసింది ఇందులో ఏముంది కనుక ! లోకంలో నిక్కినీలిగే వాళ్లూ కఠిన చిత్తులూ అవివేకులూ జనమానసాల్ని వేధించేవాళ్లూ ఎత్తులకు ఎదిగిపోయిన వాళ్లూ అందరూ ఏదో ఒకప్పుడు పతనం కావలసిందే. కాలగమనంలోకి జారిపోవలసిందే తప్పదు. అలాగే నీ వక్షోజాలు కూడా. అవి ఇప్పుడు క్రిందికి వాలి చూస్తున్నాయి. ఇందులో ఆశ్చర్యమేముంది ? విచిత్ర మేముంది ?

ఈనాడు తనకున్నదని గర్వంగా నిగిడే వాళ్లు రేపేదో ఒకనాడు సర్వం కోల్పోయి పతనం కాక తప్పదన్నది అందరెరిగిన నగ్నసత్యమే. అలాగే స్తన సౌందర్య సంపదకూడ సడలిపోతుంది. శరీర సౌందర్యం శాశ్వతం కాదు. ఇక కఠినస్తనిగా ఉన్నరోజున మిడిసిపడింది. అతడిని తిరస్కరించింది. కనుక ఈనాడు చ్యుతస్తనిగా ఉన్న ఆమెను ఎకసక్కెం చేస్తున్నాడు. అయినా చక్కనమ్మ చిక్కినా చక్కనే గదా ! ఇంతకూ ఆమె తనకు దక్కలేదనే ఇదంతా. ఎంత తగ్గిన మిరియాలుం జొన్నల సరిపోవే ! అన్నాడు కదా ఒక మహాకవి.

లలిత

అయి మన్మథ చూతమంజరి !
శ్రవణ వ్యాయత చారులోచనే ।
అపహృత్య మనః క్వయాసి తత్
కి మరాజన్యక మత్ర రాజతే ॥

తే॥ మరుని చూతమంజరి ! సుధామధురవాణి !
కర్ణములసోకు సొగసైన కనులదాన !
మనసు దొంగిలి యేడకే చనెదవీవు ?
ప్రబలునే యరాజక మట భావమందు. 26

వాలుకళ్ల సోయగాలతో ఒక యువక హృదయాన్ని దోచుకున్నది ఓ తరుణీమణి. ఆపై అతడిని చూడనట్లే హంసనడకలతో సాగిపోతున్నది. అది గమనించిన ఆ నవమన్మథుడు ఆమెనొక దోపిడి దొంగగా దోషారోపణ చేసి నిలదీస్తున్నాడు చిత్రంగా.

ఓ ఒయ్యారిభామా ! మన్మథుడి వాడిబాణమా ! నా తియ్య మామిడిరెమ్మా ! చెవులదాకా సాగిన సోగకన్నుల చిన్నదానా ! నా మనసు దోచుకున్నావే ! చూచానులే ! ఇంకా పోతున్నావెక్కడికి ? అన్నులమిన్నా ! నా మనసు దోచుకొని తప్పించుక పారిపోవటానికి అక్కడ ఏమైనా అరాజకం రాజ్యమేలు తున్నదా ? నీవు దూరంగా వెళ్లినంత మాత్రాన నీ మనసులో రతిరాజు రవ్వసేయడనుకున్నావా ? నాకు తెలియ దనుకున్నావా ? ఎందుకీ దొంగవేషాలు ? నా మీద మనసు లేదా ? అయినా నా మనసు దోచుకొని పోతుంటే చూస్తూ ఎలా ఊరుకుంటాను ? ఎలా విడిచి పెడతాను ?

ఇది అయోగ శృంగారం. తన మనసు దోచుకున్న కామబాణం ఈ మన్మథ చూతమంజరి. ఆమెను తన బాహు బంధాలతో ప్రేమభావాలతో శృంగార జీవిత ఖైదు విధించి మధురబాధను కలిగించాలని అతని భావన. ఆమె శరీర మురళితో ఆనంద రసరమ్య రాగాలు రవళింప చేయాలని తపన. ఆమెతో శృంగార నౌకలో సుఖతీరాలకు చేరుకోవాలని చెప్పలేని అభిలాష.

మాలిని

యది కథమపి దైవాద్దుర్గ మార్గే స్ఖలిత్వా
విదలిత తనుమధ్యా దీయతాం నౌ న దోషః ।
పృథునిబిడ కుచాభ్యాం వర్త్మ పశ్యావరుద్ధమ్
కథయితు మివ నేత్రే కర్ణమూలే ప్రయాతః ॥

తే॥ దైవ వశమున చొరరాని దారి జారి
వగచె తనుమధ్య మము తప్పుపట్ట దగదు ।
దారి కననీక నిగిడెను స్తనము లనుచు
చెప్పుచున్నట్లు కన్గవ చెవుల జేరె.

ఈ నాయిక దివసాభిసారిక. ఆ కర్ణాయత లోచన. అలా చెవుల దాకా కన్నులు వ్యాపించటానికి గల కారణాన్ని రసోచితంగా కవి చమత్కరిస్తున్నాడు.

వక్షోజాలు బాగా ముందుకు ఎదిగి నిక్కి నీలుగుతున్నాయి. అవి కంటి చూపును అడ్డగిస్తున్నాయి. కండ్లు అతి కష్టంమీద దృష్టిని ముందుకు సారిస్తున్నాయి. అయినా దారి కనబడటం లేదు. అందువల్ల ప్రియుడి కోసం దుర్గమ మార్గంలో నడవలేక జారి క్రింద పడి పోయింది. ఈ సంకేత మార్గంలో దైవవశాత్తు సుకుమారమైన ఆమె నడుం కాస్తా నలిగి పోయింది. ఇంతటి ఘోరకలి జరగటానికి గల కారణం, హద్దూ పద్దూ లేకుండా పెరిగిన ఆమె వక్షోజాలే ! అంతేకాని తప్పు తమది కాదని చెప్పటానికే ఆసోగ కనులు అలాగా చెవుల దాకా సాగిపోయాయి.

ఈ కావ్యనాయిక సంపూర్ణ యౌవన, చెంపకు చేరెడు సోగ కళ్లూ శృంగా కలశాలన దగిన పయోధరాలూ, ఉండీ లేదనిపించే కందిరీగ నడుము స్త్రీలకు సౌందర్య లక్షణాలు. ప్రియుడు ఇలా శృంగార రసోల్లాస పూర్వకంగా ప్రశంసిస్తే స్త్రీ పరవశించ కుంటుందా ? తత్రాపి ప్రతి ఫలంగా అమందానందాన్ని అందించకుంటుందా ! అప్పటి ప్రశంసలు మనశ్శరీరాల పరిశ్రాంతికి పరమౌషధాలు. చక్కని ఉత్ప్రేరకాలు. ఈ శ్లోకంలో అభిసారికల తెగువతనం కూడ తెలుస్తుంది.

వసంత తిలకం

కోప స్త్వయా హృది కృతో యధి పంకజాక్షి
శోచామి యత్తవ కిమత్ర విరోధమన్యత్
ఆశ్లేష మర్పయ మదర్పిత పూర్వముచ్చైః
ఉచ్చైః సమర్పయ మదర్పిత చుంబనం చ ॥

తే॥ నీదు హృది కోపమయమైన నీరజాక్షి !
చింతనొందితి ! నితరులు చెంతలేరు !
పూర్వమిచ్చిన కౌగిళ్లు ముద్దులన్ని
యిచ్చివేయవె ! బంధంబు లింతదీరు ! 28

కోపంతో మూతి ముడుచుకున్న నాయికను ఆట పట్టిస్తున్నాడు చిలిపి మగడు. అంతగా కోపమయితే ఇంతకు మునుపు తానిచ్చిన క్రియా శృంగారాన్నంతా తనకు ఇప్పుడే తిరిగి ఇమ్మంటున్నాడు. ఇరకాటంలో పెడుతున్నాడు.

ఓ పంకజాక్షీ ! నీ హృదయం కోపంతో పొగిలి పోతుందెందుకు ? నాకెంతో బాధగా వుంది. చాల చింతిస్తున్నాను. నీ కోపానికి కారకులైన నీ విరోధులెవరైనా ఇక్కడ ఉన్నారా ఏమిటి ? లేరే ! మరి ఆ విరోధిని నేనే అయితే, దానికి ఒకటే మార్గం. ఇంతకు పూర్వం నేను నీకు అర్పించుకున్న ఆలింగనాలను తిరిగి నా కిప్పుడు అర్పించుకో, అలాగే ఉరకలు వేసే ఉత్సాహంతో నీకు ఇచ్చుకున్న ముద్దు లన్నింటినీ ఇప్పటి కిప్పుడే తిరిగి ఇచ్చివెయ్యి. ఊఁ ! ఈ ప్రేమ వ్యవహారంలో మనకు ముసుగులో గుద్దులాటలు పనికిరావు.

ఇది ప్రణయకోపంలోని వాచిక శృంగారం. ప్రేమయాత్రలో ప్రణయ కోపాలు మధురానందప్రదాలైన మజిలీలు. అప్పుడు చిలిపిగా రెచ్చగొట్టే మాటలతో మత్తెక్కించి బుంగమూతి మీద చిటిక వేస్తే, ఆమె రెట్టించిన ఉత్సాహంతో హృదయానికి హత్తుక పోతుందని ఈ అనుకూల నాయకుడి పథకం. ప్రణయ పథంలో నాయికా కోపశాంతికి ఇవి ప్రణయ పద మంత్రాలు. ఇలా శృంగార స్మృతివల్ల వారికి ప్రేమానుభూతి కలుగు తుంది. తద్వారా మానానంతర శృంగారం మరీ పరిమళిస్తుంది. ఇక శృంగారం క్రమంలో ముందు ఆలింగనం ఆ తర్వాతనే చుంబనం, ఆ తదనంతరమే నఖక్షత దంత క్షతాలు, ఇంకా ఇతర సంగతులూను, ఈ వరసే ఆనందానికి సముచిత క్రమారోహణమని వాత్స్యాయన మతం. వాటిలో ఎన్నెన్ని రకాలలో ఎన్నెన్ని సరదాలో మరెన్నెన్ని పోటీలో.

శార్దూలం

మానం మానిని ముంచ దేవి దయితే
మిథ్యావచః శ్రూయతే
కిం కోపో నిజసేవకే యది వచః
సత్యం త్వయా గృహ్యతే ।
దోర్భ్యాం బంధన మాశు దంతదలనం
పీనస్తనాస్ఫాలనం
దోషైశ్చే న్మమ తే కటాక్ష విశిఖైః
శస్త్రైః ప్రహారం కురు ॥

తే॥ వట్టిమాటలు వింటివి బాధపడకు
దాసుడను నమ్ము నా మాట ! దోసమున్న
పట్టుకౌగిట స్తనముల బాధపెట్టు
చూపుతూపుల రదముల చురుకు చూపు.

29

ప్రియుడి పరదారాగమనాన్ని గురించి దాసీజనం చెప్పటంతో నాయికకు ఈర్ష్యామానం కలిగింది. అందుకు ఆమెను ప్రసన్నం చేసుకునే ప్రయత్నం చేస్తున్న ప్రియుడి విషయం ఇది.

ఓసి కోపదారి ప్రేయసీ ! కోపం దేనికే ? ఇకనైనా మానవే ! నా హృదయం పరితపిస్తున్నదే, ఓ ప్రియా ! ప్రేమికుల మధ్య తగాదాలు పెట్టి తమాషాలు చూచే సేవకుల కల్లబొల్లి మాటలు నమ్మకే ! నేను చెప్పే నిజాలు వినవే ! విన్న తర్వాత కూడ నాదే తప్పనిపిస్తే నీ ఇష్టం వచ్చిన శిక్ష విధించవే. నీ బాహువులలో బంధించవే. దంతక్షతాలతో క్షతగాత్రుడిని చేయవే, ఘనస్తనాలతో గాఢంగా క్రుమ్మవే, నీ కడగంటి చూపులతో నాకు తూట్లు పెట్టవే. కసికసిగా మన్మథ శిక్షలు విధించవే. కాయమంతా గాయాలు చేయవే !

నాయిక తన దాసీ జనం చెప్పిన మాటలతో నాయకుడిని శృంగారాపరాధిగా గుర్తించింది, దాంతో బాగా కోపం వచ్చింది. మూతి ముడిచింది. అందుకే లోకంలో సామాన్యదోషికి వేసే శిక్షలన్నింటినీ ఈ కామాపరాధి తనకు విధించమని తానే మరీ మరీ వేడుకుంటున్నాడు. ఆ శిక్షలన్నీ ఆనందాన్నే కల్గిస్తాయి కదా ! ఇదంతా వక్రచారి అయిన మన్మథ విజృంభణ ఫలితమే. కామస్యవామాగతిః అనికదా ! ఇలాంటి మానప్రణయ సందర్భాలలో సామం దానం భేదం నతి ఉపేక్ష రసాంతరం అనే పద్ధతుల ననుసరించాలి. సతిని ప్రసన్నంచేసుకోవాలి. ఇది రతి పండిత లక్షణం. అలాగే చేసిన తప్పునే చేయటం మళ్లీ ప్రియురాలిని బ్రతిమిలాడుకోవటం వీరికి మామూలే. అలా కోపంపోయిన తర్వాత ఇద్దరిలో ఉత్సాహం ఉరకలు వేస్తుంది. ప్రేమ కలాపంతో పరవశిస్తారు. దీన్నే మానానంతర శృంగారం అంటారు. భార్యను అనునయించటం ఒక కళ, అలాగే భార్య బ్రతిమలాడించుకోవటం మరోకళ. అందులో పరస్పరం నేర్పును ప్రదర్శించాలి. అంతేకాని ఎవరికీ పెంకితనం

వసంత తిలకం

కిం మాం నిరీక్షసి ఘటేన కటిస్థితేన
వక్త్రేణ చారు పరిమీలిత లోచనేన ।
అన్యం నిరీక్ష్య పురుషం తవ భాగ్యయోగ్యం
నాహం ఘటాంకిత కటిం ప్రమదాం భజామి ॥

సుగంధి

నదుముపైని నీటి కడవ
నాట్యమాడుచుండగా
దుడుకుదనపు మత్తుకనుల
తోడ జుర్రెదేలకే ?
తడయ కేగి తగిన వాని
తనివిదీర చూచుకో !
కడవ యొరుపు కటినిగల్గు
కాంతసేవ కొల్లనే !

30

నీళ్ల వాగు నుంచి వస్తున్నది ఓ ఒంపు సొంపుల మదన మంజరి. అది చూచిన ఓ యువకుడికి మనసులో మధుకీలలు రేగాయి. కానీ ఆమె పట్టించుకోనట్లు నటిస్తున్నది, అయితే ఆమెచెలికత్తె ఒకతె ఆతడిని పట్టలేని తమకంతో చూస్తున్నది నడుం మీద నీటి కడవను మోస్తూ. అయినా తాను చెలికత్తెతో సంభాషిస్తూనే తన నాయికకు అందిస్తున్న వలపు సందేశం ఇది.

ఓసీ కటిమీద ఘటాన్నిమోస్తూ ఒయ్యారం ఒలక పోస్తావెందుకే ? అరమోద్పు కళ్లతో ఎందుకలా నావైపే చూస్తావు. నేను నీకు తగిన వాడిని కాదులే ! నీకు జోడైన వాడిని ఎవడినైనా వెతికి చూచుకో ! నీళ్ల కడవ బరువుతో కటిభాగం అంతా కాయగాచి పోయింది నీకు. అలాంటి నీళ్ల కడవలు మోసే దాసిని నేను కోరనే.

ఈ సరసుడు, చెలికత్తెకు ప్రక్కనే వస్తున్నదీ ఏ అవలక్షణాలూ లేనిదీ, రసతరంగిణి లాంటిదీ అయిన రమణీమణిని అభిలషిస్తున్నాడు. పరిశేష న్యాయంతో, ఆమెకూడ అతడిని మదన భావంతో గమనించిఉంటుంది. కనుకనే తన కామ సందేశాన్ని ఇలా అందించాడు ఆ విజ్ఞ రసజ్ఞుడు. ఆపై ఆలస్యానికి అలమటిస్తున్నాడు. ఇది దశావస్థల్లోని చక్షుః ప్రీతి.

వసంత తిలకం

సత్యం బ్రవీషి మకరధ్వజ బాణపీడ !
నాహం త్వదర్పిత దృశా పరిచిన్తయామి !
దాసోఽద్య మే విఘటిత స్తవ తుల్యరూపః
సోఽయం భవే న్న హి భవేదితి మే వితర్కః ॥

సుగంధి

విసుము పంచబాణముక్త
విశిఖ ఘూర్ణ మానసా !
మనసు నందు నెంచ నీదు
మదనభావ దృక్కులన్
చనెను సేవకుండు నీదు
చంద ముందు వాడిటే !
ఘనుడ వీ వతండె యౌను
కా దటంచు నెంచితిన్.

జయంత కంతులను మించిన అందగాడు, ఎప్పటి నుండో తాను కోరుకుంటున్నవాడు కంట పడ్డాడొక వన్నెలాడికి. అయినా అనాసక్తలాగా బెట్టుగా వ్యవహరిస్తున్నది. తనసేవకు రమ్మని భంగ్యంతరంగా ఆహ్వానిస్తున్నది గడుసరిగా ఆ మాటకారి.

కామ బాణాలతో మతిచెడిన ఓ "మన్మథ మొలకా!" నీ చూపుల వాలకాన్ని నేను గమనిస్తూనే వున్నా! ఆలోచిస్తూనేవున్నా ! నీవు చెప్పేది ప్రత్యక్షర సత్యమే. కానీ నేను కూడ నీకొకటి తప్పకుండా చెప్పాలి. నీ గురించిన ఆలోచన నాకసలు లేనే లేదు. నీవు నా వాడివి కావాలనే భావనే లేదు. నీవు భలే వాడివే! అయితే ఒకటి నిజం. ఈ రోజు అచ్చంగా నీలాంటి రూపురేఖలున్నవాడే నా సేవకుడొకడు తప్పిపోయాడు. వాడు ఎక్కడ తిరుగుతున్నాడో నని వెతుకుతున్నా! అంతే ! అందుకే తదేకంగా చూస్తున్నా! అయినా వాడూ మీరూ ఒకటి కాదులే ! ఇంతా నా ఊహే, నా భ్రమే !

ఈ ప్రౌఢనాయిక వ్యంగ్యార్థంతో నాయకుని పట్ల తనకు గల అమితాసక్తిని వ్యక్తం చేస్తున్నది. వలపు వసంతం వికసించిన అతివల మాటలకు అర్థాలు వేరంటారు ఇదే నేమో ! కళ్లలో శృంగారం పండిస్తూ అతడిని తన కామ దాసుడిగా కోరుకుంటున్నది. స్పష్టంగా తెలుస్తున్నది. ఇది అతడిలోని అనంగుడికి పల్కిన ఆహ్వానం. ఆమె అంగీకారానికి ఇది కామభాషలో వికసించిన భావధ్వని.

ఇందులో చక్కని వితర్కం ఉంది. సందేహం, విమర్శ, అన్యథాభావనల వల్ల ఈ వితర్కం కలుగుతుంది. రకరకాల ఆలోచనలు, ప్రశ్నలు, రహస్య గోపనాలు శిరఃకంప భ్రూవిక్షేపాదుల ద్వారా అభినయించాలి.

